

విశ్వయోగి శ్రీవిశ్వంజీగారి దివ్యాశీస్సులతో

# విశ్వప్రకాశం

## ఆధ్యాత్మికమాసపత్రిక

శ్రీయువనామ సం॥ వినాయక చతుర్థి సంచిక ఆగష్టు, 1995

సంపుటి :1 సంచిక : 10 వెల రూ.5.00



*ప్రకాశకులు*

సర్వార్థ సంక్షేమ సమితి,
501, ప్రదీప్ అపార్ట్మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్.

*ఈ సంచికలో.....*



ముఖచిత్రము

శ్రీవల్లభగణపతి గౌరగన మూడి

## సంపాదకీయం

# వినాయకచతుర్థి

**డా. అక్కిరాజు రమాపతిరావు.**

బాలబాలికలకు అత్యంతానందప్రదమైన పండుగ వినాయకచవితి. నగరాలలో నైతే ఈ పండుగనాడు పది పదిహేనేళ్ళ బాలుర, ఇంకా ఇరవై ఏళ్ళలోపు తరుణుల ఉబలాటం, ఉత్సాహం ఇప్పుడు దృశ్యమానం కావటంలేదు కాని చిన్న పట్టణాలలో, పల్లెలలో ఇరవై ఒక్కరకాల పత్రిని వినాయకుడికి అర్పించటానికి చేసే సంరంభం ఇంతా అంతాకాదు. నేటికీ ఆ ఉత్సాహం పొంగులువారుతూనే ఉన్నది.

హిందువులు ఏశుభకార్యంలోనైనా విఘ్నేశ్వరుడిని పూజించనిది ఒక్క అంగుళమైనా ముందుకు కదలరు. ముందుగా గణపతి పూజనిర్వర్తించవలసిందే. ఆతరువాతనే ఇతర దేవతల ఆవాహనం. ఇష్టదేవతల అర్చనం. ఆయన విఘ్నాధిపతి. విఘ్ననివారకుడు. ఒకప్పుడు గణాధిపతినే సర్వాధిష్ఠదైవంగా, సర్వాభీష్టదేవతగా కొలిచేవారో ఏమో! గాణాపత్యమనే మతశాఖకూడ భారతదేశంలో పరిగణితమైంది. ఆదిశంకర భగవత్పాదులవారు షణ్మతస్థాపనాచార్యులన్న బిరుదు పొందడంలో గాణాపత్యాన్ని కూడా వారు పునః స్థాపితం చేయడమో పునరుద్ధరించడమో సంగతమయ్యే ఉన్నది. స్మార్తుల పంచాయతన దేవతార్చన పేటిలోగణపతి ముందుగా దర్శనమిస్తాడు. శుక్లాంబరధరం విష్ణుం అనకుండా ఏపురోహితుడూ ఏపరమాచార్యుడూ పూజమొదలుపెట్టడు. కలియుగంలో గణపతే ముఖ్యదైవమని మహామహోపాధ్యాయులు తాతాసుబ్బరాయశాస్త్రి మహోదయులు తమవిద్యార్థులచేత సక్రమంగా గణపతి పూజలు జరిపించేవారట. మహారాష్ట్రలోనైతే అత్యంత వైభవోజ్జ్వలంగా జరుపుకుంటారు గణపతి ఉత్సవాన్ని. పరమోత్సాహంగా తొమ్మిదిరోజులు నిర్వహిస్తారు.

లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాశయులు ప్రజలలో సాంస్కృతిక చైతన్యాన్ని స్వాతంత్ర్యోద్యమస్ఫూర్తిని రేకెత్తించడానికి గణపతి నవరాత్రి ఉత్సవాలను బలమైన సాధనంగా రూపొందించారు. మహారాష్ట్రలో జాతీయాభినివేశాన్ని ఈగణపతి ఉత్సవాలద్వారా పెంపొందింపజేశారు. మహారాష్ట్రంలో ఎక్కువమందిపేర్లు గణేశ సంబంధిగా ఉండటం గమనార్హం. అధర్వణ వేదానికి చెందిన వల్లభేశోపనిషత్తు ఉన్నది. అంటే గణేశోపనిషత్తు.

ఉపాసకులు వల్లభగణపతిని ప్రసన్నునిచేసుకోవటానికి ఆయనను ఉపాసిస్తారు. "విశ్వోత్పత్తివిపత్తి సంస్థితికరోవిఘ్నేశ ఇష్టార్థదః" అని గణపతినే ఓంకారవాచ్యునిగా పరబ్రహ్మ స్వరూపునిగా వారు అర్చిస్తారు.

తెలుగునాట అమలాపురానికి ఇంచుమించు శివారుగ్రామమైన విశ్వేశ్వరపుర అగ్రహారంలో శ్రీయనమండ్ర వేణుగోపాలశాస్త్రిగారనే గొప్పవేద విదులుండేవారు. ఇప్పుడు ఆయన విజయనగరంలో ఉన్నారు. ఆయన వేదవిద్యమూర్తీ భవించిన మహానుభావులు. వేద ప్రచారమే జీవితధ్యేయంగా తపః స్వాధ్యాయ నిమగ్నులై ఉన్నారు. ఆథర్వణీయా శ్రీవల్లభేశోపనిషత్తుకు, వారు తెలుగు అర్థతాత్పర్య నిగూఢ విషయ వివరణాత్మకంగా గొప్ప వ్యాఖ్యానంకూర్చారు. భీమవరానికి సమీపంలో గల గొరగనమూడిలో వ్యవస్థితమై ఉన్న శ్రీరామజ్ఞాన మందిర పబ్లికేషన్ లీగ్ వారు ఈ మహోద్గ్రంథాన్ని ప్రచురించారు. గొరగనమూడిలోనే ఈ శ్రీరామజ్ఞానమందిరం ప్రాంగణంలోనే కైలాసమానస సరోవరతీర వాసి శ్రీస్వామిప్రణవానంద వల్లభగణపతి అత్యంత సుందరమైన అర్చామూర్తిని **1983**లో ప్రతిష్ఠించారు. అప్పటి నుంచీ శ్రీవల్లభగణపతి అక్కడ పూజలందుకుంటున్నాడు.

నాలుగు అధ్యాయాలలో అర్చనాప్రకరణంతో కూడా కలిపి ఈ వల్ల భేశోపనిషత్తు ముద్రితమైంది. ఈగ్రంథంలో అనేక అద్భుత విషయాలున్నాయి. సర్వమంత్ర తంత్ర యంత్ర రహస్యములున్నాయి. భారతదేశంలో గణపత్యు పాసననుగూర్చి గణపతి వివిధ అర్చామూర్తుల పరమార్థాన్ని గూర్చి కన్నడంలో వెలువడిన గ్రంథానికి శ్రీజానమద్దహనుమచ్ఛాస్త్రిగారు **(కడప)** తెలుగు అనువాదం చేసి ప్రకటించారు. కాని తెలుగులో గణపతి ఉపాసనా అర్చనలకు సంబంధించి వచ్చిన గ్రంథాలలో అత్యుత్తమమైనది సర్వసమగ్రమైనది శ్రీవల్లభేశోపనిషత్తే అనిచెప్పాలి.

ఇందులో మూడవ అధ్యాయంలో గణపతి పరమార్థతత్త్వాన్ని, మంత్ర శాస్త్ర రహస్యాలను వివరిస్తూ పూజ్యులు శ్రీవేణుగోపాల శాస్త్రిగారు పొందుపరచిన వ్యాఖ్యానాన్ని ఇక్కడ కొంత ఉదాహరిస్తున్నాను.

"ద్యౌః పితా, పృథివీమాతా" అని శ్రుతి. మాతాపితృభక్తియే గణపతి అనుగ్రహమునకు కీలకము. ఈవిషయమై ఒక ఇతిహాసము ప్రమాణముతెల్పుచున్నది.

పార్వతీ పరమేశ్వరులు తమకుమారులైన స్కంద, విఘ్నేశ్వరులలో ఒకరికి సమస్త ప్రమథ గణాధి పత్యమును ఇవ్వవలెనని సంకల్పించిరి. దానికి ఒక పరీక్షపెట్టిరి. సమస్త బ్రహ్మాండమును ముమ్మారు ప్రదక్షిణముకావించిన వారికే ఆధిపత్యమని. ఆకాశగమనము కలిగి మహావేగముతో కూడిన మయూరము స్కందుని వాహనము. భూమి మీద మాత్రమే సంచరించుచు మందగమనము

కలిగిన మూషకము లంబోదరుడైన గజముఖుని వాహనము

కుమారస్వామి బ్రహ్మాండమును చుట్టు ముట్టుటకు మహావేగముతో బయలుదేరెను. కరివదనుడు విచారగ్రస్తుడై యుండగా నారద మహాముని అచటి కేతెంచి కారణమడుగగా తన విషయమును చెప్పి ఉపాయమును చెప్పుమనెను. అంతట నారదుడు "ఇదంద్యావాపృథివీ సత్యమస్తు పితర్మాతః" అను శ్రుతి వాక్యప్రకారమున తల్లిదండ్రులు ద్యావా పృధువులు, ఆది దంపతులు కనుకనే ప్రపంచమునకు మాతాపితరులు. కానవారిద్దరికి ప్రదక్షిణము చేసినచో బ్రహ్మాండమును ప్రదక్షిణము చేసినట్లే అని ధర్మసూక్ష్మమును చెప్పెను. వెంటనే విఘ్నేశ్వరుడు పార్వతీ పరమేశ్వరులకు పాదాభివందనమాచరించి ముమ్మారు ప్రదక్షిణముచేసెను. ఈశ్వరుని పేరోలగమందున్న మహామునులు, బ్రహ్మాదిదేవతలు, గణపతిని బ్రహ్మాండమునకు ప్రదక్షిణ కావించిన వానినిగా నిర్ణయించిరి ఈశ్వరుడు ప్రమథ గణాధిపత్యమును విఘ్నేశ్వరునకు ఒప్పగించెను. అందుచేతనే గణపతి ప్రథమో ప్రమథేశ్వరః" (గ.స.) ఈగాథను బట్టి మాతాపితృభక్తి గణేశునకు ముఖ్యము కనుక గణపతి ఉపాసకులకు మాతాపితృభక్తియే కీలకము దాని ప్రతీకమే "గ్లాం కీలకం స్మృతమ్" (గ.స.) (పుట113) అని శ్రీవేణుగోపాలశాస్త్రి మహోదయులు గణపతి మంత్రార్థ నిగూఢ తత్త్వాన్ని గణపతి సహస్రనామం ఆధారంగా వివరించారు. "ఆదౌపూజ్యోగణాధిపః" అనే తత్త్వాన్నిపరమ సుందరంగా ద్వితీయాధ్యాయంలో ఆవిష్కరించారు

గణపతికి సంబంధించిన సర్వరోగహర మంత్రము, సర్వ కామప్రద మంత్రము, గాయత్రీగణపతి మంత్రము, బాలాగణపతి, నీలకంఠగణపతి, అఘోరగణపతి మంత్రము, విద్యాగణపతి మంత్రము, అంగన్యాస కరన్యాసాదివివరణంతో తేటతెలుగున శ్రీశాస్త్రివర్యులు ఈగ్రంథంలో వ్యాఖ్యానించారు.

ఆయనకు గణపతి అని పేరు ఎందుకు కలిగిందని బ్రహ్మమానసపుత్రుడైన భగవంతుడైన మరీచిని కశ్యపమహర్షి ప్రశ్నించాడు. అప్పుడు మరీచి నాలుగు అధ్యాయాలలో గణపతి తత్త్వాన్ని కశ్యపుడికి వివరించాడు. అదే వల్లభేశోపనిషత్తు కశ్యపుని ప్రశ్నకు మరీచి ఇట్లా చెప్పారు. "అనాది బ్రహ్మలయిన బ్రహ్మవిష్ణురుద్రాదులయొక్కయు, మహదాదితత్త్వములయొక్కయు గణములకు పతిగనుక ఆయన గణపతి" .అయితే ఆయనను' గజాననుడని ఎందుకంటారు?! అని మళ్ళీ ప్రశ్నించాడు కశ్యపమహర్షి

'నరాకారామాయా! గజాకారః పురుషః| ప్రకృతి పురుషాభేదా కృతిధరోగజాననః!| నృగజాకృతి గణపతిస్వరూపము. అందునరాకారము మాయ. గజాకారము పురుషుడు. ఇలా ప్రకృతి పురుషులయొక్క అభేదాకృతిని ధరించినవాడు కావున గజాననుడాయెను' అని చెప్పాడు మరీచి.

గాయత్రీ గణపతి మంత్రం అని ఒక మంత్రం ఉంది ఈ

ఉపనిషత్తులో. దీనినే భర్గ విద్య అంటారనీ ఈమంత్రోపాసన బ్రహ్మనిర్వాణాన్ని కలిగిస్తుందనీ ఇహపరసాధకమనీ, బ్రహ్మతేజస్సును కలిగిస్తుందనీ అనిర్వచనీయానంద జనకమనీ వివరించారు శ్రీశాస్త్రిగారు.

అయితే ఈమంత్ర జపాలకు ఎంతో నిష్ఠ ఉండాలి. కవచము, హృదయము, చతురావృత్తి తర్పణ, స్తుతి, సహస్రనామజపములు, దేవతాపంచాంగము. నాలుగు లక్షలజపము, తద్దశాంశహోమము, తద్దశాంశతర్పణము, తద్దశాంశమార్జనము తద్దశాంశబ్రాహ్మణ సమారాధనము. ఇవి మంత్రపంచాంగము. ఇలా దశాంగసహితమందురు, అని వివరించారు శ్రీశాస్త్రిగారు. దేవతాప్రీతి మంత్రసిద్ధి కావలెనన్నచో దేవతా పంచాంగ - మంత్ర పంచాంగములను అనుష్ఠించవలెను - అనిహితవు చెప్పారు.

తత్త్వం తెలియకుండా నియమనిష్ఠలు లేకుండా మంత్రాలు లేవంటే ఎలా? దేవతలు అనుగ్రహించరంటే ఎలా. భారతీయాత్మ అంతాదేవతామయంకదా! "కలౌచండీవినాయకౌ" అను ప్రమాణమును బట్టి కలిలో గణపత్యు పాసనా, చండీఉపాసనావిశేషమోక్ష దాయకములు. కలిఅనగా పాపము, గజముఖము పాపమును పరిహరించును.

"ఉమాంగమలజాయనమః" అనే గణపతి సహస్రనామాన్ని పార్వతీ దేవివంటి నలుగు పిండి అయిన పసుపు నుండి జన్మించినాడన్న పురాణగాథను మంత్ర తంత్రార్థనిగూఢరహస్యావబోధంగా శ్రీశాస్త్రిగారు ఈఉపనిషద్వ్యాఖ్యలో వివరించారు.

ముదాకరాత్తమోదకం సదావిముక్తి సాధకమ్
కలాధరావతంసకం విలాసిలోక రక్షకమ్
అనాయకైకనాయకం వినాశితేభదైత్యకమ్
నతాశుభాశునాశకం నమామితం వినాయకమ్.

# అనుభవతరంగిణి

శ్రీ జి.యల్.యన్. విద్యాసాగర శర్మ.

*(గత సంచిక తరువాయి)*

మాస్టరుగారి దర్శనానికి అన్ని మతాల వాళ్ళు వస్తుంటారు. ఎవరికి వారు తృప్తిపడి ప్రశాంత హృదయంతో తిరిగి వెళ్ళుతుంటారు. హేతువాదులు, నాస్తికులు మాస్టరుగారితో సంభాషించి, ఆయన ఇస్తున్న సమాధానాలకు ఆశ్చర్య పడుతూ ఆయన హేతువాదదృక్పథానికీ, ఆయన సమరసభావానికీ నమోవాకాలర్పిస్తారు. విశ్వమందిరంలో అడుగు పెట్టిన వాళ్ళంతా ఒకే ఒక కుటుంబంగా మెలుగు తుంటారు. మాస్టరుగారు బొట్టుపెడుతుంటే ఆనందంతో పరవశించి పోతుంటారు. కొబ్బరి కాయలు కొడుతారు. హారతి ఇస్తారు. "ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త" నామ సంకీర్తనంలో గొంతులు కలుపుతారు. "అంతా ఒక్కటే మనమంతా ఒక్కటే" అని తమ చర్యల ద్వారా మతాతీతమైన సమైక్య భావాన్ని చాటుతుంటారు. ఏకులంవారైనా, ఏమతంవారైనా విశ్వమందిరంలో అడుగు పెట్టటంతోనే వాళ్ళు విశ్వకుటుంబ సభ్యులౌతారు. తమదంతా మానవ కులంగా ప్రేమమతంగా భావిస్తూ భక్తులు విశ్వమందిరంలో మెలగటం నిత్యం మనం చూస్తుంటాం. మాస్టరుగారికి అన్ని మతాలు తనవే. అన్ని కులాలు తనవే. అందరూ తనవాళ్ళే. నీ నాభేదం లేకుండా అందరికీ సుఖశాంతులు పంచి పెడుతుంటారు. ఆయన తరచుగా పాడే 'అంతా ఒక్కటే మనమంతా ఒక్కటే' అనేపాట ఆయన మతసహనాన్ని, విశ్వమానవ సమైక్యతనూ వేనోళ్ళచాటుతుంటుంది.

ప్రస్తుతం ఎమ్మెస్సీ పూర్తి చేసి, ఐ.ఏ.యస్‌కు 'కోచింగ్' పొందుతున్న షేక్ రహమాన్‌కు మాస్టరుగారంటే సాక్షాత్తు అల్లా. అప్పుడతను ఇంటర్ ప్యాసై మెడికల్ వ్రాస్తున్నాడు. అంతకు పూర్వం రెండు సార్లు టెస్టులకు కూచున్నా ర్యాంకురాలేదు. నర్సుగాపని చేస్తున్న నాగేశ్వరమ్మ ద్వారా మాస్టరుగారిని గురించివిన్నాడు. మాస్టరుగారిని చూడాలనుకొన్నాడు. ఆరోజురాత్రి అతనికి ఒక కలవచ్చింది. మాస్టరుగారిగది ... కార్పెట్టు పరచి ఉంది. గోడలకు దేవుళ్ళ పటాలు వేలాడుతున్నాయి. మరునాడు మాస్టరుగారి దగ్గరకు పోయిచూస్తే, ఆగదియావత్తూ రాత్రికలలో తాను చూచిన గదిలాగానే ఉంది. మాస్టరుగారు లోపల పూజ చేస్తున్నారు. రహమాన్‌లోపలికి రాగానే మాస్టరుగారు తలెత్తి, అతనివైపు ఒకసారి చూచి, మళ్ళీ పూజలో మునిగిపోయారు. మాస్టరుగారు

చూచినచూపు ఎంతో పరిచయం ఉన్నవారి చూపులా, చల్లగా, హాయిగా ఉందని పించిందతనికి. అంతే. అయస్కాంతానికి ఇనుము అతుక్కుపోయినట్లు మాస్టరుగారిని అతడు అతుక్కుపోయాడు.

ఒకసారి అతనికి వింత జబ్బుపట్టుకుంది. వొంటినిండా బొబ్బలు. డాక్టర్లకు చూపిస్తే "అదినరాలకు సంబంధించిన జబ్బు" అని చెప్పారు. మందు లేవో ఇచ్చారు. కానీ అతడామందు లేవీ పుచ్చుకోకుండా, మాస్టరుగారు అభిషేకంచేసి ఇచ్చిన గంధపు నీళ్ళు బొబ్బలపై రాచేవాడు. మూడు పూటలు మాస్టరుగారి చేతిమీదుగా విభూతి తీసుకొనేవాడు. అనుక్షణం "ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త" అని మననం చేసుకొంటూ ఉండేవాడు. నెలరోజులు అతడు మంచం మీదనుంచి దిగలేదు. విపరీతమైనబాధ. చచ్చిపోతానేమో? ననే వెర్రిభయం. మనస్సంతా అల్లకల్లోలమైపోయింది. అశాంతితో, ఆవేదనతో కుమిలి పోయేవాడు. మాస్టరుగారిని కాపాడమని ప్రార్ధించేవాడు.

ఒకరోజు మాస్టరుగారు అతని ప్రక్కనుంచున్నట్లూ .. ఆయన శరీరంపై గూడా తన శరీరంపై ఉన్న బొబ్బల్లాంటి బొబ్బలున్నట్లూ దృష్టాంతమైంది. మరుసటిరోజునుంచి అతనిజబ్బు తగ్గుముఖంపట్టింది. లేని ఓపికను కూడ గట్టుకొని, లేచి కృష్ణనగర్‌లోని విశ్వమందిరానికి వెళ్ళాడు. ఆరోజు మాస్టరుగారు ఉదయంనుంచి వొంట్లో బాగాలేక పడుకున్నారనీ, ఎవరు వచ్చినా లేపవద్దన్నారనీ తెలిసింది. మాస్టరుగారు తనవ్యాధి స్వీకరించి బాధ పడుతున్న విషయం అతడికి అర్ధమైంది. మాస్టరుగారి దయకు కళ్ళుచెమ్మగిల్లాయి. తనభక్తుడి బాధతాను స్వీకరించి తనభక్తుడికి సుఖం, ఆరోగ్యం ప్రసాదిస్తున్నారు మాస్టరుగారు! ఎంత నిస్వార్ధసేవ! రహమాన్ హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. ఆనాటినుండి ఈనాటివరకు అతను రోజు వచ్చిమాస్టరుగారిని దర్శించి పోవలసిందే. ఏదైనా పనిమీద పొరుగూరు వెళ్ళటం సంభవిస్తే మళ్ళీ తిరిగి వచ్చి మాస్టరుగారిని చూచేవరకు అతడికి పిచ్చెక్కినట్లుంటుంది. అతనేకాదు. అతని తమ్ముడు రఫీ.. అతనికుటుంబం మాస్టరుగారిని భువిపై వెలసిన 'అల్లా' గాభావిస్తూ ఉంటుంది. "మాస్టరుగారి ఆశీస్సులతో మాకుటుంబ సమస్యలన్నీ పరిష్కారమైనవి. మాస్టరుగారి పాదసేవ లభించటం మా అదృష్టం" అంటాడు రహమాన్. మాస్టరుగారు అతణ్ణి "సుబ్రహ్మణ్యం" అని సంబోధించి, పిలుస్తుంటే ఆపిలుపుకు నిలువెల్లా పరవశిస్తాడు. మాస్టరుగారు తన నుదుట విభూతి, కుంకుమబొట్టు పెడుతుంటే భక్తి తన్మయత్వంతో పులకరిస్తాడు. ఆనంద బాష్పాలు జాలువారుస్తూ "మాస్టరుగారంటే సాక్షాత్తు షిర్డీసాయి బాబా" అని భావిస్తుంటాడు.

నాగార్జునసాగర్ రైట్ కెనాల్స్ సబ్‌డివిజన్, గుంటూర్లో

"లష్కర్"గాపనిచేస్తున్న షేక్ జానీలాల్ సాహెబ్‌కు మాస్టరుగారి ముఖ్యభక్తుడైన గొబ్బూరి సత్యనారాయణ ద్వారా మాస్టరుగారి పరిచయమైంది. మొట్టమొదటి సారి జానీని చూడగానే మాస్టరుగారు "ఆవో! అందర్ ఆవో! క్యా బోలో!" అని పలుకరించారు. ఉర్దూలో "అల్లాకే ఫజిల్‌సే సబ్‌టీక్‌హై" అల్లా దయవల్ల అంతా బాగానే ఉంది, అని ఆయన ఉర్దూలోనే బెరకు బెరుగ్గా సమాధానమిచ్చాడు.

జానికి పుట్టెడుసమస్యలు, ఆ సమస్యల ఊబిలో చిక్కుకొని బేజారైపోతున్నాడు. "మాస్టరుగారు నోరువిప్పి అడిగితే తన సమస్య లేమిటో చెప్పకుండా అంతా బాగానే ఉన్నదన్నానేమిటి?" అని ఆతర్వాత చాలాబాధపడ్డాడు. ఆతర్వాత చాలాసార్లు మాస్టరుగారి దగ్గరకు వెళ్ళడమైతే వెళ్ళాడు గాని తనబాధలు చెప్పుకొందామన్నాచెప్పుకోలేక పోయాడు. అహం, అభిమానం అడ్డంవచ్చేవి. "స్వామీ! నేను చేసిన అప్పు తీరి, నాకు అప్పులనేవి లేకుండా చేసి, సంఘంలో గౌరవంగా బ్రతికేలా చూడు!" అని రోజూ రాత్రిపూట పడుకోబోయే ముందు మాస్టరుగారికి విన్నవించి, నమస్కారం చేసి నిద్రపోయేవాడు.

ఇట్లా ఒక సంవత్సరం గడిచింది. ఒక రోజురాత్రి జానికి ఒక కలవచ్చింది. ప్యాంటు, షర్టు వేసుకొని మాస్టరుగారు కార్లోంచి దిగారు. చక్కగా క్రాపు దువ్వుకొన్న ముఖం ఎంతో ప్రసన్నంగా .. ఆకర్షణీయంగా ఉంది. ఆ వేషం చూచి"ఇదేమిటి! మాస్టరుగారిట్లా ఉన్నారేం?" అనుకున్నాడు అతను. తర్వాత గొబ్బూరిసత్యనారాయణను అడిగితే "పూర్వాశ్రమంలో మాస్టరుగారట్లానే ఉండేవారని అతడు చెప్పాడు. కొన్నాళ్ళకు మళ్ళీ ఒక కలవచ్చింది. జానికి ఆస్వప్నంలో మాస్టరుగారు కనిపించి, దీర్ఘంగా నిట్టూర్పు విడుస్తూ "ఊ!బాధలు మొదలైనవన్న మాట!" అన్నారు. ఆ మాటవిని జాని వెక్కి వెక్కి ఏడుస్తూ "మొదలైనవి స్వామీ!" అని ఎట్లాగో బలవంతం మీద అనగలిగాడు."ఏమిటాబాధలు?" మాస్టరుగారు అడిగారు! పదివేలు అప్పుంది" అన్నాడు. అవును. "ఎట్లాతీరుస్తా?" వని అడిగారు మాస్టరుగారు." ఆస్తివేరే ఏమీలేదు. ఒక ఇల్లున్నది. అది అమ్మి తీరుస్తా" నన్నాడు జాని. అంతే, అంతలో అతనికి మెలకువవచ్చింది.

రెండు రోజులు గడచినతర్వాత ఒక మిత్రుడు రెండు వేల రూపాయలు తెచ్చి జానీకిచ్చాడు. ఆడబ్బుతో అతను అర్బన్ బ్యాంకులో తనకున్న అప్పుతీర్చాడు. ఆ అప్పు ఇంకొక పదిహేనురోజుల్లో కట్టకపోతే బ్యాంకువాళ్ళు అతడి ఇల్లు వేలం వేసే వాళ్ళు. ఆబాధ లేకుండా పోయింది.

లోగడ జానీ ఒకాయన దగ్గర ఐదువేలు అప్పుతీసుకోవటం జరిగింది. "మా అమ్మాయి పెళ్ళి నిశ్చయమైంది. వెంటనే అప్పుతీర్చమని ఆ ఋణదాత

రోజూవచ్చి, జానీ గొంతు మీద కూచుండేవాడు. ఆ ఋణదాత జానికి చాలా సన్నిహిత మిత్రుడే! అయినా స్నేహితుడన్న అభిమానం ఈషణ్మాత్రం కూడా లేకుండా, అతని పరువు తియ్యాలని నోటికి వచ్చినట్లు మాట్లాడేవాడు. అటువంటివాడు మాస్టరుగారు జానికి స్వప్నంలో కనిపించిన నాలుగైదురోజులకు జానీ ఇంటికివచ్చి, "ఒక మిత్రుడు నాకు పదివేలు సర్దాడు. నువ్వేమీ అంత అర్జంటుగా అప్పుతీర్చవలసిన అవసరం ఇప్పుడేమీలేదు. వీలు చూచుకొని తర్వాత నెమ్మదిగా సర్దుదువుగాని, అమ్మాయిపెళ్ళికి మీరంతా రండి! డబ్బు అవసరం పడి నేనన్న మాటలన్నీ మరచిపో!" అని ఆప్యాయంగా మాట్లాడి, శుభలేఖ ఇచ్చి వెళ్ళిపోయాడు. అతడట్లా రమ్యంగా మాట్లాడటం జానీకి చాలా ఆనందం కలిగించింది. కొండంతభారం నెత్తి మీద నుంచి తొలగినట్లైంది. ఆతర్వాత అర్బన్ బ్యాంకులో మళ్ళీ లోను తీసుకొని ఆస్నేహితుడి అప్పుతీర్చివేశాడు." ఇదంతా మాస్టరుగారిలీల. ఆయన దివ్యాశీస్సులు. ఆయన ఎదుట నేనునోరువిప్పి చెప్పకపోయినా, ఆసర్వజ్ఞులు నామనోవ్యధతొలగించి, ప్రశాంతి చేకూర్చారు" అంటాడు జాని - ఆనాటి సంఘటననుతలచుకొంటూ.

మాస్టరుగారి దయవల్ల అతనికూతుళ్ళ కిద్దరికీ బర్మాహనుమాయమ్మ కాలేజీలో, ఏప్రయాసాలేకుండా ఇంటర్లో సీట్లు దొరికాయి. మన శ్శాంతి చేకూరింది. "అల్లా ఎక్కడోలేడు. మస్టరుగారే అల్లా!" అని సంభావిస్తూ, రోజూ విశ్వమందిరానికి వచ్చి, మాస్టరుగారిని దర్శించి పోతుంటాడు. ఇటీవల ఆయన అజ్మీరు దర్గా సందర్శించడానికిపోతూ మాస్టరుగారి ఆశీస్సుల కోసం వస్తే మాస్టరుగారు ఖాజాబాబాకు సమర్పించమని ఒక శాలువా, కొన్నికానుకలు అతనిద్వారా పంపించారు. అజ్మీరులో జానికి మాస్టరుగారి దర్శనమైంది. పరవశించి పోయాడు. "విశ్వమంతా మాస్టరుగారి స్వరూపమే. చూడాలని గట్టిగా కోరుకోవాలే గాని మాస్టరుగారు కనిపించని దెక్కడ? ఆయన సర్వాంతర్యామి!" అంటాడు జానీ.

(సశేషం).

***"తీపి మనోవాచామగోచరము. అనుభవైకవేద్యము. పదార్థముల నాశ్రయించినపుడే తీపిగోచరించును. పదార్థనిర్వచనము తీపి అనుపదముతో చేయవచ్చును గాని తీపిని నిర్వచించలేము. అట్లేపరమాత్మతత్వము. అది చెక్కయందు అగ్ని వలె తిలయందు తైలము వలె పాలయందునేతి వలె పుష్పమునందు సౌరభమువలె అంతటా దాగియున్నది "***

-- శ్రీవల్లభేశోపనిషత్తు.

# శ్రీకృష్ణతత్త్వం

శ్రీ కె. ఆర్. కె. మోహన్

ఒకనాడు శ్రీకృష్ణుడు, బంధుమిత్రాదులూ, భక్తగణం, వ్యాసమహర్షి, ఎందరో మహర్షులు కలిసి యమునా నదీ తీరాన్ని జేరారు. వారు ఆ నదిని దాటవలసిఉంది. కాని ఆసమయంలో యమున వరద నీటితో పరవళ్ళుతొక్కుతున్నది. వరద ఎప్పటికి తగ్గుతుందో తెలియని పరిస్థితి. ఆ పరిస్థితిలో నదినిదాటడం ఎలా? అందుకు ఏదైనా తరణోపాయం చూపించవలసిందిగా మహర్షులను వేడుకున్నారు భక్తగణం. ఎంత ఆలోచించినా వారికి కూడా ఏమీ మార్గం గోచరించలేదు. చివరకి వారు భగవత్ స్వరూపుడైన వ్యాసమహర్షిని వేడుకున్నారు. మహర్షి కొంచెం ఆలోచించి నిజమైన బ్రహ్మచారి ఎవరో ఆయన పాదాలు ఈ నీటిని తాకితే వెంటనే యమునకి వరద ఉధృతం తగ్గి దాటడానికి దారిని కూడా ఇస్తుందని తెలియజేశారు. అంతమంది మహర్షులు అక్కడ ఉండగా, ఇంక బ్రహ్మచారులకు కొదవేమిటి అనుకుని తమపవిత్ర పాదస్పర్శతో యమునా జలాలనుతాకి సమస్యను పరిష్కరించమని ఋషివరులను వేడుకొన్నారు భక్తగణం. కాని ఏ మహర్షీ కూడా తానుత్రికరణ శుద్ధిగా బ్రహ్మచారినని చెప్పలేకపోయాడు. అప్పుడు మహర్షులు అక్కడ ఉన్నవారిలో అటువంటి బ్రహ్మచారి ఎవరైనా ఉన్నారేమో తెలియజేయవలసిందిగా వ్యాసభగవానుని వేడుకున్నారు. వెంటనే ఆయన శ్రీకృష్ణుని మించిన బ్రహ్మచారి లేడనీ అందువల్ల ఆయన పాదస్పర్శ సోకి యమున లొంగుతుందని చెప్పారు.

శ్రీకృష్ణుడు బ్రహ్మచారా? అష్టమహిషులు, శతపత్నులు, పదునారు వేలగోపికలు ఉన్నవాడు. సంసారం చేస్తూ సంతానాన్ని కూడ కన్నవాడు బ్రహ్మచారా? ఇటు వంటివాడు బ్రహ్మచారి ఎలా అవుతాడు? అని అందరూ ఆశ్చర్యపోయారు. కాని ఆ సందేహాన్ని పైకి వ్యక్తం చేయడానికి ఎవరికీ ధైర్యం చాలలేదు. వ్యాసభగవానుడు శ్రీకృష్ణుని తన పాదాలతో యమునను స్పృశించమని కోరాడు. అందుకు శ్రీకృష్ణుడు "వ్యాసభగవాన్! సంసారసాగరంలో ఈదులాడుతున్న నన్ను బ్రహ్మచారి అంటారేమిటి?" అని అడిగాడు. "లీలామనుషవిగ్రహా ... నీ భక్తులకోరిక మేరకైనా ఈ ఆదేశాన్ని మన్నించు" అని ప్రార్థించాడు వ్యాసుడు. శ్రీకృష్ణుడు వ్యాసునికి నమస్కరించి అటుతరువాత యమునకు ప్రణమించి నదిలో కాలిడాడు. వెంటనే వరద తగ్గిపోయింది. యమున రెండుగా చీలిదారి ఇచ్చింది. అందరూ శ్రీకృష్ణునికి జయజయధ్వానాలు చేస్తూ నదిని దాటారు. వారందరూ దాటగానే యమున ఎప్పటి వలే కలిసిపోయింది. తిరిగి ఉధృతంగా వరదవచ్చింది. నదిని దాటాక భక్తులు వ్యాసుల వారిని తమ సందేహం గురించి అడిగారు. అప్పుడు వ్యాసుల వారు శ్రీకృష్ణుడు ఏవిధంగా బ్రహ్మచారో

వివరించాడు. "బ్రహ్మే చరతీతి బ్రహ్మచారి" - అనగా బ్రహ్మమునందు చరించువాడు అని. బ్రహ్మమనగా సాక్షాత్ పరబ్రహ్మము. ఆయనయే సర్వ చరాచర సృష్టికీ మూలమైన ఆదిదైవం. భగవదైక్యం చెందడమనేది ఇంద్రియ నిగ్రహం కలవారికే సాధ్యమౌతుంది. శ్రీకృష్ణునకు **16108** మందిపత్నులున్న మాట నిజమేకాని ఆయన పూర్తిగా ఇంద్రియ నిగ్రహం కలిగిన వాడు. కోరికలు ఆయనకు లొంగుతాయి కాని కోరికలకు ఆయన లొంగడు. ఇంద్రియ నిగ్రహం గలవాడు. జీవితంలో ప్రతికార్యాన్నీ విద్యుక్త ధర్మంగా నిర్వహిస్తాడేకాని ఎంతమాత్రం. స్వార్ధంతో కాదు. శ్రీకృష్ణునికి ఏవిధమైన స్వార్ధములేదు. ఆయన చేసిన ప్రతిపనీ పరమార్ధ చింతనతోనే. పదహారు వేలమంది గోపికలను ఆయన స్వీకరించడానికి కారణంఉంది. వారందరినీ నరకాసుడు చెరబట్టాడు. నరకుని చంపి వారికి విముక్తి కల్పించాడు శ్రీకృష్ణుడు. ఆయినప్పటికీ ఒక రాక్షసుని చెరలో గడిపివచ్చిన స్త్రీలను సమాజం గౌరవిస్తుందా? తిరిగి చేపట్టడానికి ఎవరైనా ముందుకు వస్తారా? వివాహమైందన్న వారిని వారిభర్తలు తిరిగి ఏలుకుంటారా? త్రేతాయుగంలో ధర్మం ముడూ పాదాల నడుస్తుండినకాలంలోనే రావణుని చెరలో వుండిన సీతను, అగ్నిపునీత అయినా కూడా ఒక సామాన్యుని సంధిప్రలాపనను విని సాక్షాత్ అవతార పురుషుడైన శ్రీరాముడే పర్యిత్యజించాడే మరి ధర్మం రెండు కాళ్ళమీద నడుస్తుండిన ఈ కాలంలో ఆ స్త్రీలగతి ఏమిటి అని ఆలోచించి శ్రీకృష్ణుడు వారికి సమాజంలో గౌరవం కల్పించడం కోసం తన పత్నులుగా స్వీకరించాడు. అంతేకాని శ్రీకృష్ణుడు స్త్రీలోలుడు, వ్యభిచారి కాదు. తెలియని వారు అనేటట్లు ఆయన జారుడు చోరుడు కాదు. శ్రీకృష్ణుడు వెన్న దొంగ అంటారు. ఆయనకి వెన్నమిాగడలకేమిా కొదవలేదు. వెన్న మనసుకి సంకేతం. అంటే శ్రీకృష్ణుడు తన భక్తుల మనస్సులు హరిస్తాడని అర్ధం. శ్రీకృష్ణునికి ఎంత మాత్రం స్వార్ధం లేదు. ఏది చేసినా లోకకల్యాణం కోసమే చేశాడు. బాల్యంలోనే కాళీయ మర్దనం చేసి ప్రజల ప్రాణాలు కాపాడాడు. గోవర్ధన పర్వతం ఎత్తి గోకుల ప్రజల ప్రాణాన్ని ఆస్థుల్ని కాపాడాడు. ధర్మరక్షణం కోసం పాండవ పక్షం జేరి వారి రాజ్యంవారికి అప్పగించాడు. ఆయన కావాలని అనుకుని ఉంటే యావత్పృధ్వీమండలానికి చక్రవర్తి కాగలిగేవాడు. కాని కోరికలను దూరంగా ఉంచుకున్నాడు. శ్రీకృష్ణునిది విశ్వమానవప్రేమ. అలౌకిక ప్రేమ. ఆప్రేమను అర్ధం చేసుకున్నదీ అనుభవించగలిగినదీ రాధ ఒక్కతే. రాధది శ్రీకృష్ణుని సేవలో నిమగ్నమైన విశుద్ధ ప్రేమ. అందుకే విశుద్ధ ప్రేమకి శ్రీ రాధాకృష్ణుడు సంకేతంగా నిలిచారు. అందుకే స్వార్ధరహితుడు ఇంద్రియనిగ్రహం కలవాడు కనుకనే శ్రీకృష్ణుడు తామరాకు మీద నీటిబిందువుల వలె సంసారంలో ఉండి కూడా దానికి అంటక బ్రహ్మచారికాగలిగాడు అనివివరించాడు వ్యాసమహర్షి. శ్రీకృష్ణుని సాన్నిధ్యంలోనే ఉంటున్న ఆయన భగవత్తత్త్వం అప్పటి వరకు గుర్తించలేకపోయిన వారందరు, తమకి ఆ అధికారం కల్పించిన వ్యాసుల వారికి కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

# మోక్షానికి మరో మార్గం ....?

— డా॥ దిట్టకవి శ్యామలాదేవి.

మతసహనం వల్ల ప్రయోజనం ఏమిటి? ఆ మతం వారూ ఈ మతం వారూ కలిసి ఉండక పోతేనేం. కలిసి ఉన్నంత మాత్రం చేత దేశంలోని అరాచకాలూ హింసలూ అణిగిపోయి సుఖశాంతులతో తులతూగిపోయి స్వర్గసీమగా మారిపోతుందా? ఈ మతసహనమనేది ఏమైనా పూజా వ్రతమా, యజ్ఞమా తపస్సా? శ్రీవిశ్వయోగి విశ్వంజీ వారు మతసహనమంటూ ఎందుకని అహర్నిశలూ తపిస్తున్నారు. ఎందుకు ప్రతి సభలోను ఉపన్యాసాలిస్తున్నారు?ఐకమత్యం ఐకమత్యం అంటూపలవరిస్తున్నారు? ఐకమత్యం వల్ల ఆధ్యాత్మిక రంగానికి కలిగే లాభమేమిటి? ఆత్మవేత్తలై ఉండి ఉపనిషత్తులో ఇతిహాసాలో చెప్పకుండా అంతా కలిసి మెలసి ఉండమని ప్రబోధిస్తున్నారేమిటి? అనే ప్రశ్నలు పరమార్ధసాధకులకి సామాన్యులకీ కూడ కలుగుతూ ఉంటాయి. మరికొందరు "మేము ఎంత సహనంగా ఉన్నా అవతలి వాళ్ళు మమ్మల్ని అర్థం చేసుకోటం లేదు వారే మమ్మల్ని కవ్విస్తున్నారు, కయ్యానికి కాలుదువ్వుతున్నారు. పడి ఉండాల్సిన ఖర్మ మాకు లేదు. ఎంత సేపూ "వన్ వే ట్రాఫిక్" లాగా మేమే మీరూ మేమూ ఒక్కటి, మనందరం ఒక్కటి అని అంటున్నా అవతల వారిలో ప్రతి స్పందన లేదు. పై పెచ్చు ఇది బలహీనతగా భావించి కయ్యానికి కాలుదువ్వుతున్నారు" అంటున్నారు.

ఉన్నతమైన ఆలోచన చేయగల ఇట్టి ఉన్నత మనస్సులనే "సంఘ సంస్కర్తలు" అంటాం. వారు తమ కొరకు తమ కుటుంబం కొరకే గాక యావత్సమాజానికీ మానవాళి సంక్షేమానికీ పాటు పడతారు. వీరు యజ్ఞయాగాది క్రతువులు చేసిన వారితో సమంగా పుణ్యాన్ని సంపాదించుకోగలరని వేరే చెప్పనక్కర లేదు కదా! వారు చేసింది మానవ సేవ. పైగా నిష్కామకర్మ. ప్రతిఫలాన్ని ఆశించకుండా పని చేయడమే మనకర్తవ్యమని గీత ఘోషిస్తూవున్నది. ఇందు చేతనే పెద్దలు గురువులు భక్తులచేత సమాజ సేవాకార్య క్రమాలను చేయిస్తున్నారు. ఇక మతసహనం అన్నమాట కొస్తే ముందు అసలు మనిషికి సహనం అనే గుణమే ఎంతో తక్కువని చెప్పుకోవాలి! సహనం ఓర్పూమహామహా ఋషులలోనే తక్కువ అని దుర్వాసుని వంటి మునుల వల్ల తెలుస్తోంది. అంటే సహనం సంపాదించడం పుణ్యం సంపాదించడం కన్న చాలకష్టం. సహనం వస్తే పుణ్యం వస్తుంది. సహనం లేని పుణ్యం లేదు. మహాత్ములై కూడ శాపప్రతిశాపాల వల్ల కొంత తిరోగమించక తప్పలేదు. కోపం లేకుండా శాంతి

వహించి ఎదుటి వానిని అర్ధంచేసుకుంటే అదేసహనం. ఎదుటి వారు తప్పు చేసినా క్షమించడమేసహనం. మనకు అపకారం చేసిన వానిని కూడా ప్రత్యపకారం చేయకుండా క్షమించడమేసహనం! ఇదే ఓర్పు. సాయినాథుడు కోరిన రెండు దక్షిణల్లో ఒక దక్షిణ ఓర్పు. శ్రీవిశ్వయోగి విశ్వంజీ బోధించేదీ ఇట్టిసహనమే. మనకు తక్కువగా ఉన్నదానిని ఎక్కువ చేసుకోవడమే సాధన! ఈసహనాన్నే సాధనగా మలచుకోమంటున్నారు శ్రీవిశ్వంజీ. ఈ సాధనే మోక్షసాధనం కూడా అవుతుంది. ఈ జననమరణ రహితమైన ముక్తి సంపాదనమే జీవుని ధ్యేయం. ఈధ్యేయసాధనలో తనపని తాను చూసుకోక ఎదుటివానిని హింసించడం హేయం. హేయభావనని తొలగించుకొని ధ్యేయంవైపుకు మనసు నిమళ్ళింపచేయడం ఉన్నతం. ఈ ఉన్నతమే అత్యున్నతమై అది ఆధ్యాత్మికంఅవుతుంది శరీరాన్నీ మనసునీ హృదయాన్నీ దాటి ఆత్మవైపుకు పరుగులు తీస్తుంది. సత్యాన్వేషణకై అభిలషిస్తుంది. వండుకోడం తినడం చూసిన దాన్నల్లా సమకూర్చుకోవాలని తహతహలాడే తత్వాన్నుండి శాశ్వతమైనదానిని సంపాదించుకునే దెలాగా అని యోచిస్తుంది. శాశ్వతమైన దేదీ కనులముందు లేదని తెలుసుకున్నాక కనులు మూసుకుని లోలోపలికి చూసే ప్రయత్నం చేస్తుంది. అంతరంగాన్ని ఆత్మవైపుకు మళ్ళింపచేయగల మనస్సు పరిశుద్ధమై సామాన్యులకన్న చాలా చాలా ఉన్నతంగా ఆలోచించగలదు. ఎప్పుడైతే అంతరంగపు అంతఃపుర ద్వారాలు తెరుచుకుంటాయో అప్పుడు బహిర్ద్వారాలు మూసుకొంటాయి. అంతరంగంలో అమూల సౌధంకావల ఉన్న అమృత సరోవరంలో ఉన్న సుధలను గ్రోలిన నిత్య శుద్ధాంతః కరణులైన మహామహులు మరల బహిర్ద్వారాల కడకు వచ్చి ఈ తలుపులను తీసుకుని ఆ సుధాబిందువులను సామాన్యులకు కూడా పంచే ప్రయత్నం చేస్తారు. వీరే సద్గురువులు. కారణ జన్ములు, అవతార పురుషులు. వీరి సంకల్పం సమాజోద్ధరణమే అయినా మార్గాలు భిన్నంగా ఉంటాయి. ఈ భిన్నత్వం ప్రకృతి సౌందర్యంలోని చిద్రహస్యం. భిన్నత్వం లేనిదే సొగసులేదు. అభివృద్ధిలేదు. సాధన లేదు. పరిశోధన లేదు. పరమార్ధమూ లేదు. అందుచేతనే విశ్వమంతానిండి ఉన్నది ఒకే ఆత్మ అయినా భిన్నశరీరాలతో క్రీడిస్తోంది. కాబట్టి హింసనూ ఏ మతమూ ప్రోత్సహించదు. అన్ని మతాలూ భగవంతుడనే సముద్రంనుండి వెలికి తీసిన రత్నాలే. అన్నీ శిరోధార్యాలే.

ఒకనాడు దిగంబరుడై సాయినాథుడు నాది ఏమతమో చెప్పుకోండి అని సవాల్ చేశాడు. మతమనగా కట్టుబొట్టు తీరులు కాదని, ఆచార వ్యవహారాలు అంతకన్నా కాదనీ ఎంతసున్నితంగా ఆస్వామి చెప్పగలిగాడో?

వారేమైనా వేదపండితులా? ఎక్కడా చదువుకున్నజాడే కన్పించదు. తేడాలు భేదాలు తరతమ వాదాలూ పెద్దమనసుగలవారి కుండవు. వారికి అందరూ ఒకటే! ఎక్కువ తక్కువ ఉండవు". ఆత్మవత్ సర్వభూతాని" అందరూ తమవంటి వారే. కాబట్టే ఆత్మవిదులు మనలను మతాలపేరుతో కులాలపేరుతో కొట్టుకోవద్దని బుజ్జగిస్తున్నారు. సహనం వల్ల మనకు లభించే ఫలం కూడా ఇదే. మనం కూడా సర్వే సర్వత్రా వ్యాపించిన భగవంతుని సహనం వల్ల కూడా కనుగొన గల్గుతాం. భక్తి, జ్ఞాన, కర్మ వైరాగ్యాలనే నాల్గు మార్గాలద్వారా మోక్షప్రాప్తిలభిస్తుందని మనకు శాస్త్రాలు చెప్తున్నాయి. ఈ "సహనం" అనేది మరొక సూత్ర మార్గం. సహించండి. అవమానాలనూ నిందలనూ భరించండి. ఈ ప్రయత్నంలో మీరెంతవరకు నెగ్గుతారో మిమ్మల్ని మీరే పరీక్షించుకోండి.

ఇక వన్‌వే్ట్రాఫిక్ ఆసీ, ఎంతసేపూ అవతలివాళ్ళు అలావుంటే మేము చేతకానివాళ్ళామా అంటూ సహనం నశింపుచేసుకోడమే వీరత్వానికీ, పౌరషత్వానికీ చిహ్నంగా కొందరు భావిస్తారు. నిజానికి ఎదుటి వ్యక్తి కొడితే మళ్ళీ కొట్టడమూ తిడితే మళ్ళీతిట్టడమూ కూర్చుని లేవగల్గినా లేవలేకపోయినా ప్రతిసాధారణ వ్యక్తీ చేసే అతి సాధారణమైనపని! మనం ఈ సాధారణ వ్యక్తిత్వాన్నుండి కొంత పైకి ఎదగాలని ప్రయత్నిస్తూ వున్నవ్యక్తులం కాబట్టి అందరిలాకాకుండా ఎదుటి వారి కోపాన్ని భరించడానికి ప్రయత్నించాలి! ప్రయత్నించగా ప్రయత్నించగా ఓర్పు సహనం మనల్ని వరించి మన మనసుల్లో కాపురం పెట్టుకుంటాయి. శాంతి అనే చల్లని తెల్లని నంది వర్ధన పుష్పాలు హృదయంనిండుగా విచ్చుకుంటాయి! ఈపూలతో పరమేశ్వరుడైన గురుదేవుని పూజించుకుంటే ముక్తికన్యేదాసోహమంటూ మనలను వెతుక్కుంటూ వస్తుంది! ఈనాడు లేనిది ఒక్కమతసహనమే కాదు, ఏసహనమూ లేదు. ఒక్కయింట్లో ఒకే తల్లిదండ్రులకు పుట్టిన పిల్లల్లోనే ఎన్నోతేడాలు, ఎన్నో భేదాలు. ఎన్నో ద్వేషాలు! అలాంటిది కులాలమధ్య, శాఖల మధ్య మతాలమధ్య "సహనం"సహవాసం చెయ్యడం కష్టతరం! అందుకే పుణ్య పురుషులు కారణ జన్ములు అవతరించవలసి వచ్చింది ఇది ఎంతోఘనతరమైన కార్యం! దుష్కరమైన కార్యం. శ్రీవారి అనుయాయులందరూ స్వామి ఆజ్ఞ పాలనగా సహనాన్ని సాధన చేస్తున్నారు. కులాలు మతాలు-శాఖలు, వర్గాలు, స్థాయిలు మొదలైన భేదాలను అధిగమించే ప్రయత్నం చేస్తున్నారు. దశావతారాల తరువాత వచ్చినది జగత్కల్యాణం కొరకు శ్రద్ధ, సబూరిని వృద్ధి చేయడానికి సాయినాథునిది ఏకాదశావతారం. మానవసమైక్యతకు విశ్వకళ్యాణానికి సత్యం శీలం ఐకమత్యం పవిత్రత అనే చతుర్విధ గుణాలను పెంపొందింపచేసే విశ్వనాథునిది (శ్రీవిశ్వయోగి విశ్వంజీ) ద్వాదశావతారం,

# "విశ్వయోగి"

*డా|| వై. గౌరీశంకర్, గుంటూరు.*

ఓం శ్రీసాయిరామ గురుదేవదత్త, సత్యం శివం సుందరం
త్రిగుణ్యా విరిశోభితం ప్రసన్నం సర్వలోకానామ్,
విశ్వంజీ సద్గురుం నమః

అది సహ్యాద్రి. ఉషోదయ శుభ వేళ. వేదఘోష వినవస్తున్నది. మంగళ వాద్యాలు మధుర మోహనంగా, వీనుల విందుగా ఉన్నాయి. యోగులు. సిద్ధపురుషులు, వేదమూర్తులు, శిష్యగణము, వేవేల ముక్కోటి దేవతలు అక్కడ వేంచేసి ఉన్నారు అనఘాంబిక సేవలను అందుకుంటున్న శ్రీగురుదత్తుడు ధ్యాన ముద్రలో ఉన్నారు. ఆ స్వామి కన్నులను తెరవగానే ముందుగా దర్శనం చేసుకోవాలని, ఆ ప్రకృతి కూడా పరవశురాలు అవుతున్నది. అందుకేనేమో, ప్రకృతి రమణీయత ఆ ప్రాంతంలో మనస్సును పులకింపచేస్తోంది. స్వామి కనులు తెరవగానే అక్కడ కోటిసూర్యులు ఒక్కసారే ఉదయించినట్లుగా తోస్తున్నది. దత్తస్వామి అందరిని ఒక్కసారి చూసి, చిరునవ్వు నవ్వి "నా అవతారము మరొక్కసారి ఈ విశ్వంలో ఉన్న పశుత్వాన్ని పారద్రోలి శాంతిని పెంచడానికి అవసరము అవుతున్నది." స్వామీ, ఈ అవతారము ఎక్కడ, ఎప్పుడు, వివరముగా తెలియ చేయండి" అనగానే స్వామి నవ్వుతూ" భార్గవ, జమదగ్ని ఋషుల గోత్రంలో జన్మిస్తాను. విశ్వమానవ సమైక్యతను సాధిస్తాను. అదే నా ప్రాణంగా, అదే నా ధ్యేయంగా చేసుకొని, అందరి మనస్సులలో ఉన్న కల్మషాన్ని కడిగి. అందరూ ఒక్కటే, భగవంతుడు ఒక్కడే అన్న భావాన్ని కలుగజేస్తాను."

శ్రీగురుదత్తుడు ఆ విధంగా సంకల్పమాత్రంచేత తన అవతారాన్ని గుంటూరులో 50వ సంవత్సరము పూర్తి చేసుకుంటున్నాడు. ఆయనే విశ్వయోగి లీలా విశ్వంభరుడు, సర్వమంగళుడు, సర్వఆధివ్యాధిభేషజుడు, సర్వసంకట హారి, సర్వపాపక్షయకరుడు, తాపదైన్యనివారకుడు, జ్ఞానయోగనిధి, విశ్వగురువు, భక్తవత్సలుడు, సిద్ధసేవితుడు, ఔదుంబర పరివేష్టితుడు, స్మర్తృగామి, అత్రివరదుడు, కాలాగ్ని శమనుడు, యోగిజనవల్లభుడు, సిద్ధరాజు, విశ్వంభరావధూత, మాయాముక్తావధూత, ఆది గురువు, శివరూపుడు, దివేంబరుడు, దేవదేవుడు, కృష్ణశ్యామకమలనయనుడు. ఈ విశ్వాన్ని ఆవరించిన మహత్తర శక్తివలయమే

విశ్వయోగి".

స్వామి అవతారతత్వంఅనూహ్యం, మనోజ్ఞం. మధుర భావ సంకేతం, విశ్వకళ్యాణదాయకం, విజ్ఞాన సంపత్ ప్రదం, ఇంద్రనీల కాంతితో విరాజిల్లే స్వామి దివ్యమంగళ విగ్రహం భక్తులపాటి కల్పవృక్షము, విశ్వయోగిస్మరణము వెంటనే ఇష్టసిద్ధినొసగుతుంది. ఆయన జటాధారి, భస్మలిప్తశరీరులు, యోగీశ్వరేశ్వరులు, కృపానిధి.

**విశ్వయోగి దివ్యామృత భాష్యాలు :**

దేహమే దేవాలయం, హృదయమే దైవపీఠం, మనస్సు పవిత్రంగా ఉండాలి. శరీరం పవిత్రంగా ఉండాలి, మనము చేసే ప్రతి పనీ ధర్మానికి, చట్టానికి లోబడి ఉండాలి. సనాతన సంప్రదాయాన్ని పాటించాలి, ఆచరణ ముఖ్యం. ఆచరణ లోపమే అన్ని అరిష్టాలకు మూలం, ప్రబోధించటంకాదు, ప్రకాశించటం, ప్రకాశింపచేయటం ముఖ్యం. ఆహార, విహారాల్లో నియమము పాటించాలి. అప్పుడే అమరత్వము సిద్ధిస్తుంది. అదుపు, పొదుపు మనిషికి చాలా అవసరము, అదే రక్షిస్తుంది.

అంతా ఒక్కటే, మనమంతా ఒక్కటే. ఉన్నది ఒకేకులం, అది మానవకులం. ఉన్నది ఒకటే మతం, అది ప్రేమమతం, మానవత్వమే విశ్వమానవ కళ్యాణానికి పునాది.

మనసు ప్రధానమైనది. మనోమాలిన్యాన్ని నశింపచేస్తే సంకల్ప సిద్ధిలభిస్తుంది. పిరికితనం మరణంకంటే హీనమైనది. అహంకారాన్ని, మనోవికారాన్ని పోగొట్టుకోవాలి. కృతజ్ఞత అన్నది ప్రతి మానవుని ప్రథమలక్షణం కావాలి. సమాజంలో జీవిస్తూ సమాజాన్ని నిర్లక్ష్యం చేయరాదు. ప్రతి మనిషీ సమాజానికి ఋణపడి ఉన్నాడు. ఈ జగత్తుని గురువుగా భావించి ఎంతో తెలుసుకోవాలి. నిరంతరం కర్మశీలిగా ఉండి, పిల్లలకు ఆదర్శవంతంగా ఉండాలి.

సద్ గురువుమీద నమ్మకము, విశ్వాసము ఉంచితే ధైర్యంగా ముందుకు సాగి, విజయాన్ని సాధించవచ్చు. గురుశిష్యుల సంబంధం హృదయానికి, హృదయానికి మధ్య ఉన్న అనుబంధం. గురువు అనుగ్రహం సంపాదిస్తే కార్మిక దోషం కరిగిపోతుంది.

సమాజం సంస్కరించబడాలంటే ముందు నిన్ను నీవు సంస్కరించుకోవాలి. కుటుంబాన్ని సుస్థిరం చేసుకోవాలి. గృహం స్వర్గసీమగా, ప్రశాంత నిలయంగా, ఆనంద నిలయంగా, నిత్య కళ్యాణం పచ్చతోరణంగా ఉండాలి. ప్రేమను ఇవ్వాలి, ప్రేమను పెంచాలి, ప్రేమను పంచాలి, ప్రేమతో

అందరినీ కూడగట్టుకోవాలి. ఈ ప్రపంచమంతా ప్రేమతో నిండి, అందరూ కలిసికట్టుగా ఒకేమాటగా, ఒకేబాటగా, విశ్వశాంతికి, విశ్వశ్రేయస్సుకు దోహదంచేయాలి.

స్వామియొక్క ఆశీస్సుల ఫలం చేత, పూర్వజన్మ సుకృతంవలన వారి వెంటుండే భాగ్యము కలుగుతూ ఉన్నది. అప్పుడప్పుడు స్వామి ఎవరు? ఏమిటి?ఆయన తత్వము ఏమిటి? అని ఆలోచన వచ్చినపుడు, ఆ ఆలోచన మనసులో దాగిన ఎన్నో మధురానుభూతులను బయటకు తెలియచేస్తుంది. జీవితము అనేది జన్మ, మృత్యువు అనే రెండింటిమధ్య కాలవ్యవధి, అది సృష్టికర్త నిర్ణయం. విశ్వయోగి తనవద్దకు వచ్చే భక్తులలో పిల్లలు లేనివారికి ఆ భాగ్యాన్ని తన ఆశీస్సులతో ప్రసాదించారు. మృత్యుముఖంలో ఉన్నవారికి తిరిగి జీవం పోశారు. వారితో కొన్ని సందర్భాలలో ఉన్న నేను, వారు చెప్పిన కాల వ్యవధిలో స్వర్గస్థులైనవారిని చూశాను. జన్మ, మృత్యువు, రెండింటిని తెలియచేసిన ఆయన పరబ్రహ్మస్వరూపమనే చెప్పవచ్చు. దీర్ఘ రోగాలతో తన వద్దకు వచ్చేవారికి దివ్య వైద్యాన్ని అందించే ఆయన దత్తాత్రేయ అవతారమో లేదా షిర్డీ సాయి అవతారమో మనమే తెలుసుకోవాలి. అందరి కష్టాలను ఓపికతో విని, వాటిని తన దివ్యవాక్కుతో పోగొట్టి, అందరూ బాగుండాలని, అందరి జీవితాలు వెలుగుతోనిండాలని నిత్యం కాంక్షించే ఆ విశ్వజ్యోతి, ఆ జగత్ప్రభువు సాక్షాత్తూ ఆ దత్తాత్రేయ అవతారమే అని నా భావన. ఎందుకంటే ఆయన అన్ని కుటుంబాలలో సభ్యులే. అందరికీ ఆయన దత్తుడు అయినాడు. మరి ఆయన విశ్వదత్తుడే. ఎవరి భావనకు, ఎవరి విశ్వాసానికి తగినట్లుగా వారికి ఆయన దర్శనమిస్తూ ఉన్నారు. భక్తులకు, ఆర్తులకు, ఆశ్రితులకు వచ్చే భరించరాని బాధలను, రోగాలను తను స్వీకరించి, తన యోగ సాధనతో తొలగిస్తున్నాడు. అది షిర్డీసాయి చేసేవారని మనము తెలుసుకున్నాము. మరి "విశ్వయోగి" షిర్డిసాయి అవతారమా?

భక్తులు, ఆశ్రితులు ఇంకా ఎందరెందరో వారిని తమ, తమ ఆరాధ్య దేవతల్లో వారిని చూసి, తన్మయులైవారి అవతారాలుగా భావిస్తున్నారు, పూజిస్తున్నారు. తమ మనోప్రాకారాలలో ప్రతిష్ఠించుకుంటున్నారు. భగవంతుని రూపు, అవతారము అనంతం. భక్తుని యొక్క భావన, ఆలాపన కూడ అనంతమనే భావించాలి. ఒకరి భావనను వేరొకరు పొందలేరు. స్వామి అనుగ్రహాన్ని పొంది, ఆయన శక్తిని పొందిన వారికి తెలుస్తుంది. వారి మనస్సులో, హృదయంలో ఆ రూపు నిలుస్తుంది.

**విశ్వసందేశము :**

స్వామి చాలా సభల్లో అందరికీ తెలియచేసే విషయాన్ని మీకు తెలియచేస్తాను. మానవజన్మ ఉత్తమమైనది. సద్వినియోగం చేసుకోవాలి. మనిషి మహాత్ముడిగా మారి, పరిపూర్ణమైన మానవత్వాన్ని పొందాలి. వర్గవైషమ్యాలను వదిలివేసి, కుటుంబవ్యవస్థను చక్కదిద్ది, గృహాన్ని స్వర్గధామంగా మార్చుకొని, యావత్ మానవసమాజము ఒక కలియుగ వైకుంఠంగా మారాలి. విశ్వామానవసమైక్యతతో సంఘటితముగా జీవిస్తూ విశ్వమానవకళ్యాణాన్ని సాధించాలి. అదే అందరి యొక్క ధ్యేయం కావాలి.

ఈ మహోజ్వల విశ్వశాంతి అవతారము 51 వ సంవత్సరము పూర్తిచేసుకుంటున్న సందర్భంలో ఆ మూర్తి, దివ్య జ్ఞానదీప్తి, విశ్వమానవ కళ్యాణ స్ఫూర్తియొక్క దివ్య ఆశీస్సులు, భక్త జనులందరికీ, ప్రపంచానికి అంతటికీ ఉండాలనీ, ఉంటాయని మనస్ఫూర్తిగా కోరుకుంటూ, ఆ స్వామియొక్క అవతార లక్ష్యము, మనందరి ధ్యేయం కావాలని; ప్రేమతో పదిమందిని కలుపుకొని, సమైక్యతను సాధించాలని, తద్వారా రాష్ట్ర సౌభాగ్యము, దేశ పురోగతిని ఇంకా, ఇంకా పెంచాలని, దానికోసం స్వామియొక్క దివ్యశక్తిమనలను వెంట ఉండి కాపాడుతూ, ముందుకు వెళుతుందని భావిద్దాం.

ఆకాశంలో నక్షత్రాలనయినా లెక్కకట్టవచ్చు కాని స్వామి తన భక్తులను ఆదరించి, ఆదుకున్న సంఘటనలను లెక్కించటం సాధ్యంకాదు. "ఎలా ఉన్నారు?" అంటూ ఎల్లప్పుడూ భక్తుల యోగ క్షేమాలను విచారించే స్వామి యొక్క విశాల ఫాలభాగం, సిరులై విరిసే ఆ చిరునవ్వులు, పెదవి విప్పకనే ప్రేమను పంచుతుంటాయి. అపురూపమయిన ఆ అమృతపు వీక్షణాలు గుండెల అంచులను దాటి ఊహింపరాని, ఊహించలేని అనురాగాన్ని అందిస్తాయి.

సనాతన ధర్మోద్ధారకులై దేవాలయాలను ప్రతిష్ఠించారు. కుల, మత, జాతి విభేదాలులేని కరుణామూర్తి. వారి భక్తబృందములో అన్ని మతాలవారు సమానముగా గౌరవింపబడుతున్నారు.

**('విశ్వరచన' సౌజన్యంతో)**

పందిరి మందిరమగునా
వందిజనంబాప్త మిత్రవర్గంబవునా
తుందిలుడు సుఖముగనునా
గొంది నృపతి మార్గమవున గువ్వలచెన్నా

*— గువ్వల చెన్న శతకం*

# పురుషోత్తము నెరుగుట

— శ్రీ జిల్లెపల్లి

పూర్ణత్వము కలిగినవాడే పురుషుడు. సంపూర్ణత్వము పురుషోత్తముని సంకేతము. సమత్వము ద్వారా పూర్ణత్వమును సార్ధక పరచుటతో మానవతా జీవలక్ష్యము మానవత్వము నందుకొనగలదు. స్వార్ధ పరత్వమును పరార్ధకత్వమునకు చేర్చుటయందలి సాధన వలన జీవప్రభృతి సమత్వమున సాగగలదు. దైవ ప్రపత్తి మానవకల్యాణ మకరందము. అసురవిపత్తి కారణకళ్యాణ కమనీయత, సాత్వికగుణ సంపన్నతతో సమత్వ సంధానము నెరుంగగలము. రజోగుణమున సమత్వ సాధన స్వార్ధకరమై పూర్ణత్వమునకు భంగము వాటిల్ల చేయును. తమోగుణ గమ్యంబుగ సాగుసమత్వము పరార్ధ కత్వముగ సాగనిచో లోభత్వము చేరును. లోభమున సాగే మోహము లోలత్వ ప్రధానమగును. లోలితుడైనవాడు కర్మ వ్యాసంగితుడై వాసనారహితుడుకాలేడు. అందున సంపూర్ణత్వము నందుటకు సాత్వికుడొక్కడే అర్హుడైనాడు.

కర్మము ధర్మము నాశ్రయించినప్పుడే లేమితొలగి ఆధ్యాత్మికానందమునకు విలుకలుగును. ధర్మముదారితప్పినచో అధర్మముగా కనుపించకున్ననూ గతాగత అనుభవ దర్శితమైన కామము మోహముగా రూపుదిద్దుకొనును. మోహితుడైన జీవి క్రోధలోభాలనే నేత్ర దృష్టిని పెంచుకొనును. పరిశీలించునప్పుడు ఔచిత్యము అనౌచిత్యముల నెరింగి ధర్మనిర్ణయంచేయక ఆత్మ గమనికను కోల్పోయి సమత్వ సంపదను కాలదన్నడం సాధ్యమవుతుంది. సద్గురు సంప్రోక్షణా సమవీక్షణల సాయమందుకొన్న జీవికి జ్ఞానధనము సమకూడి విశ్వాసము విలక్షితముగాక సమత యోగభాసితమగును.

తాను జీవినన్నభాస సాగినంత కాలము నాశములేని శాశ్వతమైన ఆత్మగ్రాహ్యముతో భయభ్రాంతులను దాటి భక్తి తారకముగ శ్రద్ధ ఓర్పు నేర్పు తీర్పులతో మార్పు నెరుంగ గలదు.

ప్రాతిపదికగా సాగగా కర్మానుభవ జీవలబ్ధిత పదార్ధ హిత ప్రేరణ కారణంగా మానవత్వమున విశ్వజీవ దృష్టిని తనయందారోపించుకొన్న విలు సంతరించును. అరిషడ్వర్గ క్రియాకల్పనకు దూరంగా వుంచుచూ అహంకారమును దాటి మనసు బుద్ధి గమ్యంగా చిత్తస్థిరత్వమును సంపాదింప విలు కలదు. విశ్వవ్యాపితమైన ఆత్మ గమ్యాన్ని గుర్తించుకొనుటలో షిర్డిసాయి – శ్రీ విశ్వంజీ లాంటి సద్గురు సేవాజీవనము వరప్రదానమగును. సద్గురువులైన శ్రీవిశ్వంజీ

దత్తావతారులుగ ప్రస్ఫుటీకరింపబడినందున వారి సమాశ్రయంతో శ్రవణానందము స్మరణానందము పంచుకొని బాధామయ జీవ ప్రారబ్దసంగమాన్ని దాటుటకు వీలుకలుగును. చావు పుట్టుకల పరిశీలన సాగునప్పుడు కర్మ బద్ధులైన జీవులకు పరిష్కార సాధ్యము గాని భయ భ్రాంతి నివారణమును సద్గురు సమాశ్రయమందు సేవనము దాస్యము కీర్తనములాంటి నవవిధ భక్తి సూత్రనియమ నిష్ఠా విధానములవలన వీలగును. అహంకారము సద్దుమణిగి కర్మను అకర్మగా చేయుచు జీవపు విశ్వాసములతో అనుభవ విశ్వరూప సందర్శన ప్రాప్తిని సద్గురువు సంధాన పరుపగలరు. విశ్వదర్శనావకాశమందలి యనుభవమే విజ్ఞానమై తాను యీ విశ్వమందన్నిటియందున కలదన్న సత్యజ్ఞానము సమతాయోజనకు దారికల్పించును. పురుషోత్తమ ప్రాప్తికి మూలమైన మానవతా విశ్వస్పందనమును అనుభవమందు ఆచరణలో మనసావాచా కర్మణా సద్గురు సేవాభరణముగ చేసుకొన్న జీవి పురుషోత్తముడగుటకు అర్హుడనబడును.

# భక్తి శ్రద్ధలు కలిగేది ఎలా!

శ్రీ జి.శ్రీశైలం

విద్య యొక్క వికాస ప్రభావం చిత్తశుద్ధిగావ్యాపించిననాడు భక్తి శ్రద్ధలు కలుగుతాయి. ఈనాడు భక్తి శ్రద్ధలు లేకనే ఏరంగంలోనైన స్వచ్ఛత లేక దేశం పతనమైపోతున్నదంటే అతిశయోక్తిగాదు. చక్కని విద్యాలయాలు, ఉత్తమగురువులు జనించవలసిన అత్యవసరమున్నది. సంస్కృతం బోధన ఉగ్గుపాలతోనే ప్రారంభంకావాలి. ఏరోజు కారోజు హాయిగా గడిచిపోయే స్వార్థం పదవుల ఆరాటంలో చెడుకు దోహదంచేసే దుర్గుణాలు ఎక్కువైనందువల్లే భక్తి శ్రద్ధలు నశిస్తున్నాయి (ఏవిషయంపై) స్వార్థంపై మనసులగ్నంకాని వారిని ఈ బాటవైపు ఆకర్షించే మంత్రోపదేశాలుకావాలి. మొద్దు బారిన వ్యవస్థను నవరత్న ఖచితంగా మార్చాలి. స్వయంగా ఎవరికి వారు సదాలోచనలతో ఆలోచిస్తూ తమకు నచ్చిన సత్క్రియలవైపు మొగ్గు చూపుతూ వుండాలి. ఇక్కడ ఎంతో ఓర్పు, సహనంకావాలి ఆశించిన మేరకు సఫలీకృతంకానప్పుడు క్రుంగి పోకుండా కూడ గట్టుకోవాలి. విధికూడ కొంత సయ్యాటలాడిస్తుంది. అవలీలగ ఏదీ సిద్ధించదు. క్రమంగా భక్తి శ్రద్ధలను అలవరచుకోవాలి. మహోన్నతమార్గాన్ని చూసేదిమాత్రం నూటికి కోటికి ఒక్కడే. అటువంటి వాళ్ళను మనందక్కించుకోవాలి. విపరీత జనోత్పత్తి వల్ల అవినీతి పెరిగి పోతున్నది. ఆజాడ్యాన్ని తొలగిస్తేనే ఉదారనీతి పరిమళాలు వికసిస్తాయి. భక్తిశ్రద్ధలు కలుగుతాయి.

# జంటకవులు శ్రీవేంకట పార్వతీశ్వరులు

**శ్రీకాముఋషి సత్యనారాయణశర్మ**

*గతసంచిక తరువాయి భాగం*

"1923 పూర్వం సాహిత్యంలో వేంకటపార్వతీశ్వరులది కూడా గట్టి ప్రభావమే. వీరికావ్యాలలో తురాయి వంటిది ఏకాంతసేవ. తెల్లవారగట్ట పెళ్లివారిని లేపే మనోహరమైన సన్నాయిపాటలాగ, నవయుగారంభంలో వీరికావ్యగానం వినిపించేది భాషలోను, ఊహలలోను, ఆవేశాలలోను పూర్వాసంప్రదాయలను గౌరవిస్తు ఉత్తమ వంగ వాఙ్మయంద్వారా వచ్చిన వైష్ణవ సాహిత్య ప్రభావాల్ని స్వీకరించి వీరు కావ్యరచనలో క్రొత్త దనం చూపించారు. వీరి ఏకాంత సేవ - 1922 లో పుస్తక రూపాన వెలువడినది. యువకవి కూటాలలో ఎంతో ఆప్యాయంగా ఆలపించుకునే వారు. వీరి మధుర ఖండకావ్యం కనబడని పత్రిక కొంతకాలం ఉండేది కాదు. వీరు గీత పద్యానికి, మంజరికి మంచి పలుకు బడిని సంపాదించి పెట్టేరు"

వీరు గద్య రచనకు ప్రాముఖ్యం కలిపించారు. అందు దీర్ఘ సమాస గుంఫన శ్రమగోచరించదు. అవధాన కళాచమత్కారములులేవు. వీరి గద్యము సులలితిము. సరళము, సుమధురమై భాసించింది. గిడుగు గురజాడలవ్యవహారిక రచనలకు ప్రాధాన్యం కలిగించిన రోజులవి. తరంమారింది. పఠితుల అభిరుచులు మారినవి. పూర్వకావ్య ప్రబంధ ఫక్కీ, ఒకే మూసలో పోసిన కావ్య నాయకులు ఆధునికులకు ఆమోదంకాలేదు. ఈనవ్య కవితావైతాళికులు సమకాలీన పఠితల అభిరుచులకు తగినట్లుగా, పదప్రయోగంలో, భావప్రకటనలో, ఇతివృత్త సేకరణలో ఒక నవీన రీతిని సంతరించుకున్నారు. పద్య రచనలో శార్దూలము, మత్తేభము, చంపకమాల ప్రాచుర్యం తగ్గింది. అందువల్ల గీతము, ద్విపదలకు క్రొత్త అందము కూర్చి దానికి సహృదయస్పందన కలిగించారు. పంచమ స్వరమాధుర్యం, ద్రాక్షాపాకం అందించారు వీరి రచనలో ప్రకృతి యందలి ప్రతిసుందరవస్తువు కావ్యవస్తువులై పఠితలను పలకరించి అలరింపుజేసేయి. జలద మాలికలు, చివురు జొంపములు, మధుమానయా మినులు శరత చంద్రికలు, వారి కవితలో నానావిధ శోభితమై ప్రకృతి చిత్రణలో నేపధ్యా భూమికలైనాయి.

ఉద్యానవనమున దాత వివిధ కుసుమకోరకములవలె వారికి విత్యో ద్యాన వనంలో మధుర పరిమళ భరితమైన కావ్య కుసుమాలు కొల్లలుగా పుష్పించి వికసించాయి. ముద్దబంతి పూల మొరిపె మొక రకము - చామంతుల సౌందర్యమొకరకము. మల్లెలదొక మందహాసము. మొల్లలదొకలాలిత్యం గిరిమల్లికల తావిలోని తీయదనము, గులాబీల గండుతనము, పారిజాత ప్రసూనముల పవిత్రత, మందారముల రక్తిమ, జాజులచల్లదనము ఇటువంటి ప్రకృతి దృశ్యములందలి సౌందర్యము వీరి కవితలో కొల్లలుగా ప్రకటితమైంది. నవలా రచనలో చారిత్రకము, సాంఘికము, అపరాధిపరిశోధకములైన వివిధ శాఖలలో వీరి కాలము సాగిపోయినది. వానిలో అద్భుత, భయనక, వీర, శృంగార రసములు పొంగిపొరలు చుండును బంకించంద్ర పోచకడే దేహు వంటి ప్రసిద్ధమగు కవుల రచనలను ఆంధ్రీకరించి వంగభాషా సౌరభములను తెలుగు వారి కందించారు. అపరాధ పరిశోధక నవలందలి అరిందంబాబు, ఫూల్‌సాహెబ్ వంటి పాత్రలనేటికి తలంచినంత మాత్రానే భయకంపితుల గావించును. శ్యామలా వసుమతి వసంతము, బృందావనము, ప్రమిదావనము, మాయావి, మనోరమ, మాయావిని మొదలగు శీర్షికలలో ప్రకటితమయ్యేరచనల కొరకు పఠితలు ఎదురుచూచెడివారు.

1911 లో ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము స్థాపించి శతాధిక గ్రంథాలు ప్రకటించి ఆంధ్రపాఠకలోకాని కందించారు. సారస్వతాభిమాని, కవిపండితపోషకుడు దాత, అగు కొవ్వూరిచంద్రారెడ్డి గారు ఈ కవుల మాతృమందిరముగా ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయమునకు అధ్యక్షులై ఆసంస్థకు ప్రధాన పోషకుడుగా చిరస్మరణీయుడయ్యెను. ఆంధ్ర జమీందారులు మహారాజపోషకులై ఆలంబన కలిగించారు. వీరు గ్రంథరచన కారంభించిన పది, పదునేడుసంవత్సరాలలో వివిధ గ్రంథాలు ఒక లక్ష ప్రతులు ముద్రించి పాఠకుల కందించారు.

1932 సంవత్సరంలో నరసారావుపేటలో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్తులో ఉయ్యూరు రాజావారు వీరికి కవిరాజహంసలని, 1943 లో ఈ కవుల షష్టిపూర్తి సందర్భంలో శ్రీశాంతిరామమూర్తి I.C.S గారు కవికులాలం కారబిరుదునిచ్చి గౌరవించారు. షష్టిపూర్తి సందర్భంలో కావ్యకుసుమావళి పేరిట భాగములుగా వీరి పద్యకృతులను సంకలనం చేసి ప్రకటించారు. రాజభక్తి గేయంలో కర్ణుని వృత్తాంతము, శ్రావణశుక్రవార కథలో ఆంధ్రుల సంప్రదాయము, గోవ్యాఘ్ర సంవాదంలో కరుణరసం ప్రధానంగాను కవితలల్లారు. గోవు తనబిడ్డకు పాలిచ్చి తిరిగి వచ్చి వ్యాఘ్రమున కాహార మగుదునవి, రానిచో ఆ పాపపరిహారము నిట్లు నుడువును.

"అతివలవిడలేనియతు లేగుగతికి
ఇష్ట మిత్ర ద్రోహలేగెడుగతికి
బోయెదనమ్మనేబోయిరాకున్న

అని ఎన్నోప్రమాణాలు చేస్తుంది. వీరి పద్యాకావ్యాలలో 'ఏకాంతసేవ' మకుటాయమానమైనది. ఇదొక మధురభక్తి కావ్యము (1922) వంగ భాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో ఆంధ్రమున ఏకాంత సేవ అట్టిదని కృష్ణశాస్త్రిగారు ఈకావ్యపీఠికలోవ్రాశారు.

మధుర భక్తిలో పరమేశ్వరుడొక్కడే ప్రియుడు. భక్తులందరు ప్రియురాంద్రు. సర్వసమర్పణ చేయగల స్త్రీత్వసిద్ధి పొందినగాని భక్తునకు పరమేశ్వర దర్శనం కాదు. "పరమ ప్రేమరూపాభక్తిః" అని నారదనిర్వచనం. ప్రణయాధి దేవత రాధ దీనికి ఉదాహరణ. వైష్ణవసాహిత్యంలో ఆండాళ్ - రాజస్థాన్‌లో మీరా ఈ విరహభక్తి అనుభవించారు. ప్రియురాలు ప్రియునికొరకు అన్వేషణ, విరహం, తన్మయత పొందినగాని భక్తి పరాకాష్ట చెందదు. ప్రియురాలు ఏకాంతంగా తన హృదయేశ్వరుని సేవ కొరకు సిద్ధపడుతుంది. ప్రాతఃకాలమందుకు తగినది. ఉషః కాల అరుణోదయ వేళ ప్రకృతిలో నభోమండలంలో గోచరించే అరుణకాంతులు, పక్షులకు కిల కిలారావములు, కోయిలకలస్వనాలు అన్నీ పరమేశ్వరు సేవకు ఉద్దీపకాలు -

ప్రకృతి అది యేమొరాగ సంభరితమయ్యె
ప్రభుని శ్రీపాదములు గొల్చు వేళయేమొ -
వర మనోహర పంచమస్వరము నెత్తి

పాడ వేమమ్మ కోయిలా పాడవమ్మ! అని పికాంగనను ప్రబోధిస్తుంది. ఆయనకు స్వాగతమిచ్చుటకై ప్రియున కిష్టమైనని వేదనలు సమకూర్చి సిద్దపడుతుండి ప్రభు సందర్శనోత్సాహియైన ప్రియురాలికి ఆ నవమోహనుడు తటిల్లతలాగ దర్శనమిచ్చి. ఆమె తన్మయురాలైయుండగా అదృశ్యుడౌతాడు. ఆమె ప్రియావిరహంభరించలేక - ఎన్నో విధాల విలపిస్తుంది.

శాంతరూపానంత జలరాశివీవు
నవనవైకానందనౌకనునేను
సకల కళాపూర్ణ చంద్రుండవీవు
సదమల చిద్రూపచంద్రిక నేను

అని తనకు తనహృదయాధి నాథునకుగల అనుబంధం వివరిస్తుంది. కాని

ప్రభుని దర్శన భాగ్యం లభించలేదు. ఒక మధుపాన్ని రాయబారిగా పంపుతుంది. ఆ అన్వేషకునితో "ప్రణయవనంబులోపల పుష్పరధము. తుమ్మెదా వేవేగతోలి తేవమ్మ" అని ప్రబోధిస్తుంది. ఆయన రూపురేఖలు, అందచందాలు, ఆనవాళ్లూ, ఆయన ఉనికిపట్లు వివరిస్తుంది.

ఒక కొలనిలో రాయించ పరువెత్తుతూంది. ఆమార్గంలో తన ప్రియుడుండవచ్చునని ఆశిస్తుంది.

నెమ్మి పురివిప్పి ఒక.చోట నాట్యం చేస్తున్నది. ఆయన రాక కేమోనని భ్రమపడుతుంది.

చివురాకు జొంపములు, జలజమాలికలు అన్నీ వెదకి చూడమంటుంది. తన ప్రియునిరాక తెలియజెప్పిన వారికి లంచమిస్తానంటుంది. బహుమతుల నేకరువు పెడుతుంది. ఇంతలో తోడి సఖ్యులు కొందరెదురైనారు. వారి వలన తన ప్రియుని సపత్నీ సహచర్య లీలలువింటుంది. మత్సర గ్రస్తు రాలౌతుంది. అసూయపడుతుంది.

"విరిబోణి ఈమాట విన్నా వటమ్మా!
నానాథునెటనైనకన్నావటమ్మా!"

అని వాపోతుంది. ఒక సఖి చేలాంచలము పట్టుకున్నాడట. ఒక అదృష్టవంతురాలికి గాఢాలింగన మనుగ్రహించాడట. ఒక ముగ్ధకు ముద్దులిచ్చాడట. అని తన ఇష్ట సఖులతో విన్నవించి బాధపడుతుంది. ఈవిధంగా కొంతడవు విరహవేదననుభవించాక ప్రియుని దర్శనభాగ్యం కలుగుతుంది. .

"విరిదండ మెడలోన వేయుటేగాని
తనివితీరగపల్కరించనేలేదు
కనుమూసి నీమూర్తిభావించుటేగాని
కన్నార నీ మూర్తి గాంచనేలేదు."

అని వాపోతుంది. నాథుని దర్శనంకాగానే విహ్వాలమై నిశ్చేష్టురాలైంది.

"ఈ మొగ్గ విరియించి యిన్నాళ్ల దాక
దండ గుచ్చుటకింత తడయుటయేల?
ఈ గీతిక రచించి యిన్నాళ్ళ దాక
మరల బాడుటకింత తడయుట యేల
దర్శనమొసంగుటే తప్పుగా దోచెనే!"

అని నిందలాడుతుంది. చివరకు తనకు సామీప్య, సాయుజ్య సిద్ధి ననుగ్రహింపమని వేడుకుంటుంది.

"సర్వలోకేశ ఈసాలభంజకను
నీకాళిగృహములో నిలువగానిమ్ము"

అని ప్రార్థించితన్మయిరాలౌతుంది. ఇదొకద్వైత భావనకు పరాకష్ఠ.

స్వహస్తాలతో పెంచి పెద్ద జేసి మూడు నాలుగు దశాబ్దాలు ఆంధ్ర సాహితీరంగంలో స్వైరవిహారం చేసి మాతృమదిరం ఆంధ్ర ప్రచారిణి గ్రంధనియానికి వీరు దూరమైపోయారు. వారి సంతతికి వారి గ్రంథాలపై కాపీరైటు కూడ లేకుండా బోవుట విచారకరము.

1943 లో పిఠాపురం నాటి యువరాజా గంగాధర రామారావుగారి కోర్కెపై వాల్మీకి రామాయణం అనువదించారు. వాల్మీకి హృదయం వీరిలలిత పద్యసరళిలో కుశలవులై గానం చేసేరు. సుందర కాండలో హనుమకు సీతాదర్శనమైన ఘట్టంలో పార్వతీశ్వరకవి అస్తమించారు. 1955 కవిసోదర వియోగంతో శ్రీ వేంకటరావుగారు మరల కలంపట్టలేదు. అనంతరం దైవానుగ్రహబలంతో పార్వతీశ్వర కవిగారి కుమారుడు అచ్యుతరామ చంద్రమూర్తితండ్రి, మామయ్యల రచనకనుగుణంగా యుద్ధకాండ అనువదించి కావ్యం సంపూర్తి గావించారు. తిరుపతి తిరుమల దేవస్థానం వారిటీవల ఈ కవిరాజ హంసలరామాయణం ప్రకటించుటకు పూనుకున్నారు. శ్రీవేంకట్రావుగారి ద్వితీయ కుమారుడు కళాప్రపూర్ణ రజనీకాంతరావుగారు ఏకాంత సేవ ఆంగ్లమున అనువదించి ఆ మధురకావ్యానికి రాష్ట్రేతరులకందించారు. అదికూడ తిరుపతి తిరుమల దేవస్థానంవారిచే ప్రచురింపబడింది.

నవ్యకలితా వైతాళికులైన వీరి ప్రభావం యువరచనలో గోచరిస్తుంది. వసుమతీ వసంతమువంటి నవల వ్రాసి చరితార్థునికావవెనని ఆరోజులలో విశ్వనాథ వారు అభిలషించేవారని పెద్దలు చెపుతారు. వారిరచనలు పునర్ముద్రణకావలసియున్నది. ఆంధ్ర ప్రభుత్వము వారు, సాహిత్య అకాడమిలవారు పూనుకుంటె మరల వారి రచనలు నవలలు యువతరానికి అందుబాటులోని కరాగలవని ఆశిద్దాము. వీరి రచనలలో బాలగీతావళి దేశభక్తిగీతాలు ఎన్నోవిధాలున్నాయి. వచన రచనకు ప్రాచుర్యం కలిగించి, రచనను సులభతరం గావించి నవ్య కవితకు వైతాళికాక లైన వీరి కవితలు అమరమైనాయి.

# దివ్యయోగిచరితామృతం

## కదిరిమంగళం మునీంద్రస్వామి

**(1876 - 1961)**

**-- ఆచార్య బి. రామరాజు**

కలియుగ ప్రత్యక్షదైవం శ్రీవేంకటేశ్వరస్వామికి తిరుమల ప్రాంతాలు విహార భూములు. అవి మహిమాన్వితమైన దివ్యతపో భూములు. చిత్తూరు జిల్లాలో పలుప్రాంతాల్లో అడవుల్లో, కోనల్లో, పర్వతగుహల్లో ఎందరో మహాత్ములు తపస్సు చేసి సిద్ధులైనారు. అట్టి వారిలో సద్గురు మునీంద్రస్వామివారొకరు. తిరుమలకు సమీపాన స్వర్ణముఖీతీరాన యెలమండ్యం అనే గ్రామం ఉంది. ఆగ్రామంలో 19 వ శతాబ్దంలో చతురంతల గోత్రం, పాకనాటి రెడ్లలో గాలిమాసి సుబ్బారెడ్డి అనే సజ్జనుడుండేవాడు. ఆయన కొడుకు లక్ష్మణరెడ్డి, కోడలు అంజేరమ్మ. సదాచారసంపన్నులైన ఆదంపతుల పూర్వ పుణ్యం పండి కొలది దినాలకే అంజేరమ్మ అంతర్వత్నిఐనది. ఏడవ నెలలో ఒక రాత్రి నాల్గో జామున ఒక దివ్య ప్రకాశం తనను ఆవరించినట్లు కలగని లేచి ఆ వృత్తాంతం భర్తకు చెప్పింది. మరునాడు లక్ష్మణరెడ్డి దైవజ్ఞులను సంప్రదించినాడు. వారు అంజేరమ్మగర్భంలో మహాపురుషుడు పుడుతాడన్నారు. అన్నట్లే తొమ్మిది మాసాలు నిండిన తరువాత ఒక శుభ ముహూర్తాన అంజేరమ్మ నయనానందకరుడైన మగబిడ్డను కన్నది. ఆ బిడ్డకు మునిస్వామి అని నామకరణం చేసినారు ఆ మునిస్వామియే మనకథా నాయకుడు సద్గురు మునీంద్ర స్వామి

అల్లారు ముద్దుగా పెరుగుతున్న మునిస్వామి రెడ్డి హృదయంలో నాల్గవ సంవత్సరంలోనే భక్తి బీజాలు పడినవి. వచ్చీరాని మాటలతో భజనలు పాడుతుంటే శ్రోతలు ఆనందించేవారు. చీరాల సుబ్బయ్య అనే భాగవతుడు మునిస్వామికి ఐదవయేట అక్షరాభ్యాసం చేయించినారు. ఈ భాగవతుడు తన విద్యార్థులందరికీ తారకమంత్రం ఉపదేశించేవాడు. మునిస్వామిరెడ్డి ఆ మహామంత్రాన్ని శ్రద్ధగా ఉపాసించినాడు. దానితో అతనికి అలౌకిక జ్ఞాన సంపత్తి కలిగింది. బడిచదువులు సన్నగిల్లినవి. లక్ష్మణరెడ్డి కొడుకును

వ్యవసాయం పనులకు పంపసాగినాడు. క్రమంగా వ్యవసాయం పనులన్నీ అబ్బినవి. పదునారవయేట అడుగిడిన మునిస్వామి హృదయం నిండారాముణ్ణి పెట్టుకొని, చేతినిండావ్యవసాయం పనులు చేస్తుంటే ఆతని శరీరం తళతళమెరిసేది. పొలంపనులు చేస్తూ చేస్తూ రెడ్డికన్నులు ప్రకృతివైపు పారినవి. గట్టుపైన కూర్చుండి ఆలోచనలో పడ్డాడు. ప్రకృతిలోని సమస్త స్థావరజంగమాలు ఏదో ఒక నియమానికి లోనైఉన్నవి. ప్రాణులన్నిటికి జననమరణాలు తప్పనిసరి. ఒక ఋతువు తరువాత మరొక ఋతువు, దాని ధర్మాలు క్రమం తప్పకుండా వస్తున్నవి. ఈ జగద్రహస్యమేమిటో కదా అని ఎంతో సేపు ఆలోచించినాడు. తనకు తెలియకుండానే సంజచీకట్లు అలముకుంటున్నాయి. ఒక సారి బయటి ప్రపంచం వైపు పారజూచి ఇంటి బాట పట్టినాడు. ఆతని మనస్సులో ఈ జగద్రహస్య భేదనకై పెద్ద చింత పట్టుకున్నది. భక్తిరసతుందిలుడైన మునిస్వామి రెడ్డి ప్రవర్తన పూర్వం ఒక తీరుగా ఉండేది. ఈ చింతమూలంగా ఆతని ప్రవర్తనలో క్రొత్త మార్పు వచ్చింది. ఎవరితోనూ మాట్లాడకుండా ఏకాంతంగా ఉండటం, పరధ్యానంతో పనులు చేయటం గమనించిన ఇరుగుపొరుగు మునిస్వామిది పిచ్చివాలకమన్నారు. అమాటలు విన్న తల్లిదండ్రులు కలవరపడ్డారు, ఒక్కగా నొక్క కొడుకు మహాత్ముడౌతాడని దైవజ్ఞులు చెప్పిన కొడుకు పిచ్చివాడా అని వారి గుండెలు రోదించినవి. 18 ఏండ్లు నిండిన అతనికి పెండ్లి చేస్తే లౌకిక దృష్టి కలుగుతుందని భావించి సమీపగ్రామం తాతయ్యకాలువ అచ్యుత గోత్రులు బుచ్చిరెడ్డి మంగమ్మల కూతురు చెంగమ్మతో వివాహం జరిపినారు. మునిస్వామి చెంగమ్మల దాంపత్యం పరమాత్మ జీవాత్మల పవిత్రబంధంగా సుఖసంతోషాలతో వర్ధిల్లింది. పవిత్రకార్యాలలో అతిధి అభ్యాగతుల మర్యాదలతో వాళ్ళ గార్హస్థ్యం అర్థధర్మానుసారంగా నడచింది. ముగ్గురు కొడుకులు ఇద్దరు బిడ్డలు పుట్టినారు. రాజయోగియైన మునిస్వామి కుమ్మరి పురుగువలె సంసారం సాగించినాడు.

శా.శ ౧౮౪౭ రక్తాక్షి పుష్యశుద్ధ ఏకాదశి సోమవారం (5-1-1925) ఏకాదశీ వ్రతదీక్షితుడైన మునిస్వామి తదేకంగా రామతారకం జపిస్తూ ప్రపంచం మరచిపోయినాడు. ఆతనికి వైకుంఠ ధామము, అక్కడి సూరులు, వారి భక్తి వైభవము అనుభూతికి వచ్చినవి. శుద్ధ నిర్వికల్ప సమాధి కలిగినది ఎరుకకు వచ్చిన తరువాత ఆయనలో గొప్పమార్పువచ్చింది. ఆత్మదర్శనం తరువాత మునిస్వామి రెడ్డికి సమస్త ప్రపంచం పరమాత్మ స్వరూపంగా గోచరించింది. స్త్రీలు పురుషులు, భార్య, ఇరుగుపొరుగు అందరిలోను పరమాత్మ దర్శనమే. మునిస్వామి ఒకచో కూర్చుండక, నిలువక, తినక, నిద్రపోక ఎనిమిది మాసాలు బ్రహ్మానంద మగ్నుడై తిరిగినాడు. ఆయన సంగతి కర్ణాకర్ణిగా విని ఒక

శ్రావణపూర్ణిమనాడు తూకివాకం వాస్తవ్యుడు వేదవేదాంగవేత్త నారాయణాచార్యులనే వైష్ణవోత్తముడు మునిస్వామి యింటికి వచ్చినాడు. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే తమ యిల్లు చక్కదిద్దటానికి వచ్చినాడని అందరు సంతోషించినారు. జ్ఞానియైన నారాయణాచార్యులకు మునిస్వామి అతీంద్రియజ్ఞానశక్తి, పరిస్థితి అవగతమైనవి. ఆనాడే మునిస్వామికి శ్రీమదష్టాక్షరీ మంత్రం ఉపదేశించి హస్తమస్తక సంయోగం చేసి భ్రూమధ్యమున చూడుమన్నాడు మునిస్వామికి బాహ్య దృష్టి పోయి ఆత్మసాక్షాత్కారం జరిగింది; బ్రహ్మానుభవం కలిగింది. బాహ్య ప్రజ్ఞకలిగిన తరువాత ఆచార్యులవారు మునిస్వామి రెడ్డికి మునీంద్ర స్వామియనే దీక్షానామం ఇచ్చినాడు. వారం దినాలు గురు శిష్యులకు మధ్య ప్రశ్నోత్తరాలు, చర్చలు జరిగినవి. ఆచార్యులవారు శిష్యునికి వేదాంత రహస్యాలు బోధించినారు. మునీంద్రస్వామి సంపూర్ణంగా విరక్తులైనారు.

ఇప్పటి నుండి మునీంద్రస్వామికి ఏకాంతంగా తపస్సు చేయటం నిత్యకృత్యమైనది. ఆత్మ శక్తితో ఆయనకు సమస్త విషయాలు అవగతమయ్యేవి. గహనమైన వేదాంత రహస్యాలు సులభసుందరశైలిలో బోధించే శక్తి అలవడింది. ఆయనను మానవాతీతశక్తులు వరించినవి. ఆర్తులు జిజ్ఞాసువులు చేరవచ్చినారు. వచ్చినవారిలో కొంద రనుచరులు, కొందరు శిష్యులుగా మారినారు మునీంద్రస్వామి ప్రతి సంవత్సరం వైకుంఠ ఏకాదశీ వ్రతం ఆచరించి మూడు దినాలు సమాధిలో ఉండేవారు. ఆ మూడు దినాల అనుభవాలు శిష్యులకు జిజ్ఞాసువులకు వినిపించేవారు. శ్రీముఖ సంవత్సరం వైకుంఠైకాదశీ వ్రతసమాధిలో (27-12-1933) మునీంద్రస్వామికి శ్రీసీతారామలక్ష్మణుల దర్శనం ప్రాప్తించింది. ఆ ముగ్గురు తన తలపై తలంబ్రాలు పోస్తున్నట్లు అనుభూతి కలుగటంతో ఆయనకు అప్రయత్నంగా నిర్వికల్ప సమాధి చిక్కింది.

స్వభాను కార్తీక శుద్ధ దశమి ఆదివారం 2-11-1943 నాడు మునీంద్ర స్వాములు అమరం కండ్రిగకుపోయి స్వగ్రామం యెలమండ్యం తిరిగివస్తూ బత్తలవాని కండ్రిగలో పేదబాలుడైన వెంకటస్వామికి బ్రహ్మోపదేశం చేసినారు. గురూపదేశానుసారం వెంకటస్వామి బ్రహ్మచర్య నిష్ఠతో భగవద్ధ్యానం చేసేవాడు. వెంకటస్వామికి వాలాజాతాలూకా అమ్మూరులో (తమిళనాడు) టెలిగ్రాఫ్ శాఖలో ఉద్యోగం లభించింది, అక్కడ రైల్వే స్టేషన్‌లో రామారావు గుమాస్తాతో స్నేహంలభించింది. వెంకటస్వామి రామారావింట్లోనే నివాసం ఏర్పరుచుకున్నాడు. నిత్యగురుధ్యానం చేస్తూ ఒకనాడు తీవ్రవైరాగ్య కలగటంచేత వళ్ళిమల కొండల్లో తపస్సు చేయటానికి 31-10-1946 నాడు బయలుదేరి పోతూ రాజీనామా పత్రం రైల్వేస్టేషన్‌లో పోస్టు చేయటానికి వెళ్ళినాడు. తమజ్ఞానదృష్టితో శిష్యుని

ప్రవర్తన గమనిస్తున్న మునీంద్రస్వామి అదే సమయానికి అమ్మూరు స్టేషన్‌లో బండినుండి దిగినాడు. గురుశిష్యులు కలుసుకున్నారు గురువుగారి శక్తికి ఆశ్చర్యపడి శిష్యుడు వారిని తమ మిత్రుడు రామారావు ఇంటికి తోడుకపోయినాడు. మునీంద్రస్వామి అక్కడవారం దినాలుండి వేదాంత బోధచేసినాడు. తత్ఫలితంగా వెంకటస్వామికి దివ్యజ్ఞానం కలిగింది.

ఒంగోలు జిల్లా ఈతముక్కల సముద్రతీర గ్రామం, జ్వాలా ముఖిదేవతకు ఆవాస భూమి. అక్కడ గాత్రం జాలయ్య అనే పండిత ప్రకాండు డున్నాడు. ఆయన భూమానందులనే అచల సంప్రదాయ గురువు వద్ద దీక్షతీసుకున్నారేగాని వేద వేదాంతమార్గానుయాయి కావటంచేత అచలం అతనికి నచ్చలేదు. జాలయ్య గొప్పపౌరాణికుడు కూడ. నెల్లూరు జిల్లా కోవూరు సమీపం ఇనమడుగులో పురాణం చెప్పటానికి ఆకురాతి రామయ్య ఇంట బసచేసినాడు. ఆకురాతి రామయ్య మునీంద్ర స్వామి శిష్యుడు కావటంచే ఆతని నోట గురువు మహిమలు విని దర్శనం చేసుకోవలెననుకున్నాడు. 1945 మార్గశిరంలో మునీంద్రస్వామి కోవూరుకు వచ్చి బుద్ధి భీమయ్య అనే భక్తునింట దిగినాడు. ఒకనాటిరాత్రి జాలయ్య పడుకొని ఉండగా జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు కాని స్థితిలో మునీంద్రస్వామి దర్శన మిచ్చి ఆతడనుసరించేది తప్పుడుమార్గమని చెప్పి దివ్యప్రకాశంగా మారిపోయినాడు. వెంటనే జాలయ్యకు సూర్యమండలం కనబడింది. ఆయన ఈవిషయం రామయ్యకు చెప్పితే త్వరలోనే మునీంద్రస్వామి దర్శనం ఔతుందన్నారు. మరునాడే జాలయ్య రామయ్య తోడుగా పోయి కోవూరులో మునీంద్ర స్వామిని దర్శించినాడు, రామకృష్ణ పరమహంస వివేకానందులవలె వారుభయులు గురుశిష్యులైనారు. మహాపండితుడైన జాలయ్య శాస్త్రి మునీంద్రస్వామిని జ్ఞానమార్గం - బ్రహ్మోపదేశం -సాధనకాలం - జ్ఞాని యొక్క అనుభూతులు - భగవంతుడు, కర్మ, పునర్జన్మలగురించి ప్రశ్నలడిగి సందేహాలు తీర్చుకొన్నాడు. స్వగ్రామం ఈతముక్కలకు గురువుగారిని తోడ్కొనిపోయి కొన్ని మాసాలు సేవించి అనుభవ వేదాంత రహస్యాలు తెలుసుకొని ధన్యుడైనాడు.

చిత్తూరు, నెల్లూరు, ఒంగోలు, గుంటూరు జిల్లాల్లో మునీంద్రస్వాములకు చాలా మంది భక్తులు శిష్యులు ఉండటంచేత వారు ఈజిల్లాలు పర్యటిస్తూ పరమార్థ బోధచేసేవారు. జాలయ్య శాస్త్రి మూలంగా మునీంద్రస్వామి వలపర్ల ప్రాంతాలు పర్యటించారు. అందువలన వలపర్లవ్యాసవ్యులు పండితకవి కార్యమపూడి నాగభూషణం స్వామి శిష్యులైనారు. ఆకవి స్వామిజీవిత చరిత్రం వ్రాసినారు, గురువుగారి వ్యక్తిత్వంబాగా చిత్రించినారు. మునీంద్రస్వాములు నిరంతరం ఆత్మావలోకనానిమగ్నులు, శమదమాది షట్కసంపన్నులు,

కులమతవర్గభేదరహితులు, సమయం దొరికినపుడల్లా రేయింబవళ్ళు వేదాంత విచారం చేసేవారు. ఏది చెప్పినా అనుభవ పూర్వకంగా చెప్పేవారు. నిరీహులు నిస్పృహులైన స్వామివారు శిష్యులెంత ధనమిచ్చినా అవసరపూర్తికి మాత్రమే తీసుకునేవారు. అచలమార్గానుయాయులెందరో ఆమార్గం విడిచి. స్వామివారిశిష్యులైనారు. వారిమహిమలకు ఆకృష్టులై నాస్తికులాస్తికులైనారు. స్వామివారిది అనుష్ఠాన వేదాంతము. వారు రచించిన బ్రహ్మజ్ఞానామృత సంగ్రహం జిజ్ఞాసువుల పాలిటి కల్పవృక్షం.

మునీంద్రస్వాముల యోగవిభూతులనేకం, పెక్కుమందికి పెక్కుచోట్ల దర్శనమిచ్చి ఏకకాలంలో అనేక భక్తులిండ్లలో భిక్షచేసి భక్తులకు సంతోషం ప్రసాదించిన సంఘటనలు అనేకం. భక్తులు చేసే గురుపూజా మహోత్సవాల్లో స్వామివారు గంటల తరబడి నిర్వికల్ప సమాధిస్థులై అఖండాకారవృత్తి నందుకునేవారు. పూర్ణిమపూజలయెడ స్వామికి మక్కువ యెక్కువ, భక్తులెక్కువగా ఉన్న గ్రామాల్లో సాధు సమాజాలు నెలకొల్పి వారిద్వారా పూర్ణిమ పూజలు చేయించేవారు. వలపర్ల మున్నగుప్రాంతాల్లో ఇప్పటికీ ఈ కార్య క్రమాలు జరుగుతున్నాయి.

మునీంద్రస్వామి సిద్ధ సంకల్పులు వారు తలపెట్టినపనులు సులభంగానెరవేరేవి. యెలమంద్యం సమీపంలో పుత్తూరుతాలూకా కదిరి మంగళం గ్రామంలో చాలామంది శిష్యులుండటంచేత స్వామి అక్కడొక ఆశ్రమం నిర్మింపదలచినారు. మాలేపాటి వెంకట కృష్ణయ్య నాయుడిచ్చిన స్థలంలో వికారి శ్రావణ శుద్ధ పంచమి ఆదివారం **9-8-1959** నాడు శంకుస్థాపనచేసి అనతికాలంలో విశాలమైన ఆశ్రమం నిర్మించినారు. వారు త్రికాలజ్ఞులు కనుక ఆశ్రమంలో తమకోసం సమాధికూడ ముందుగానే కట్టించుకున్నారు. నిర్యాణ సమయానికి మూడు నెలల ముందే వారికి బాహ్య జగద్విషయక భేద దృష్టి తొలగిపోయి జగమంతా ఏకాకారంగా గోచరించేది. స్త్రీ పురుష నామరూపభేదం తొలగిపోయింది. అట్టిసమయంలో బి. వెంకటస్వామి (స్వామిచరిత్ర ప్రకాశకులు) స్వామి సన్నిధికి రావటంచేత బ్రహ్మవిద్య బోధించి తత్త్వచారార్థం నియోగించినారు, దామర్లకోటయ్య కార్యమపూడినాగభూషణంగార్లను వల్లపర్ల ప్రాంతంలో ప్రచారకులుగా నియుక్తి చేసినారు. **11-5-1961** నాడు వారందినాల తరువాత దేహం చాలిస్తామని ప్రకటించి సమాధిస్థులైనారు. జాలయ్య ప్రభృతిశిష్యులు భక్తులు కదిరి మంగళం చేరినారు. శా.శ.౧౮౮౩ ప్లవ జ్యేష్ఠశుద్ధి పంచమి **18-5-1961** నాడు కన్నులు తెరచి భక్తుల నాశీర్వదించి జీవసమాధియైనారు.

ఈనాటికీ వారి సమాధి భక్తులపాలిటి కామధేనువై సర్వాభీష్ట ప్రదాయిగా ఉంటున్నది. నిత్యపూజలు పూర్ణిమా గురుపూజాకార్యక్రమాలు వార్షికోత్సవాలు వైభవంగా జరుగుతున్నాయి. బి.వెంకటస్వామి (ప్రస్తుతం బ్రహ్మానందభారతీ స్వామి) గారు గురువు ఆనతిమేరకు బ్రహ్మవిద్యా ప్రచారం నిర్విరామంగా చేస్తున్నారు. తమ శిష్యుల సహాయంతో అత్తికుప్పంలో ఒక ఆశ్రమం నిర్మించి 16-3-1962 నాడు గురువుగారి చిత్రపటం నిల్పి మంత్రజపయజ్ఞాలు నామసంకీర్తనలు పారాయణలు వేదాంతోపన్యాసాలు సాగిస్తూ గురువుగారి కీర్తి చంద్రికలు వ్యాపింపజేస్తున్నారు. 9-3-1969 నాడు గురువుగారి శిలావిగ్రహంతోపాటు దత్తాత్రేయస్వామి విగ్రహం స్థాపించి నిత్యారాధనలు జరుపుతున్నారు. గురువుల మహిమనుబట్టి శిష్యుల చేతలుంటాయి. సనాతన వేదధర్మ ప్రతిష్ఠాపకులైన మునీంద్రస్వామి శిష్యులు భక్తులు జ్ఞాన జ్యోతులు వెలిగిస్తూ భారతీయార్ష ధర్మానికి దోహదం చేస్తున్నారు.

**ఆధారం :- శ్రీసద్గురు మునీంద్రస్వామి జీవిత చరిత్ర - రచయిత కార్యమపూడి నాగభూషణం, వలపర్ల; ప్రకాశకులు బి.వెంకట స్వాములు, అత్తికుప్పం - 517401.**

To Smt/Sri 1995

Dear Sir/Madam

**Sub :** All India Agama Sadas : New Delhi

Todays world is marked by a degree of disharmony and strife which has put the faith in God out of the hearts of most people. The proliferation of evil in the environment around us has shaken our faith and led most of us to become cynical. It is to dispel this atmosphere of doubt that the intervention of holy men is needed and also the traditional Sanathana Dharma to be preached to show the right path to the humanity groping in the dark for a proper direction.

Sarvartha Sankshema Samithi has been organised to offer its humble services towards the goal of building a society in which people lead a peaceful, harmonious and happy life based on the tenets of our ancient scriptures, Vedas, Puranas, Shastras and Agamas etc to achieve the unique concept of oneness in God to the spirit of universal brotherhood.

Sarve Janah Sukhino Bhavanthu

The Samithi has already taken up several activities, one of them is a spiritual monthly Magazine named "Vishwa Prakasam" from last October '1994.

The Samithi proposes to conduct a large scale Inter National Seminar at Delhi next month on "Spiritual values for Universal Integration and peace" in which scholars, eminent personalities, are expected to participate besides getting papers on the subject to publish a book.

The Agama Shastras are mainly connected with the day to day rituals and worships in the temples and holy places, which are the living objects to spread their everlasting light, for the welfare of the society. Nowadays we are neglecting and not performing minimum rituals in most of the temples, which are called "Shakthipeethas", may be one of the reasons for inviting Natural calamities and disasters.

Therefore, the Samithi also proposes to conduct a National Agama Sadas during the same period in New Delhi to discuss on various Agama Shastras. It is proposed to invite the peethadhipathis and holy persons of the land, in this programme, along with VVIPs to grace the occasion.

In this connection we are going to publish a book on the Agama Shastras and its importance on day to day life for the people in general.

I therefore request you to be kind enough in contributing neatly typed writeup on various aspects on the above subject so as to include it in the proposed book which will be released on the same day. Please note the latest date for your contributions to reach us may not exceed 15th July 1995, to the Hyderabad address. The articles should be in only English.

I am herewith enclosing a detailed brochure to enable you to get much more information.

Invitations along with detailed programme will follow at the appropriate time.

With regards,

Yours Sincerely

**P.V. Manohar Rao**


UNIVERSAL INTEGRATION PILLAR
VISWAMANAVA SAMAIKYATA SAMSAT (VISWAMANDIRAM)
VISWANAGAR, GUNTUR. Phone : 33633




ఆలయములు వేరైనా ఆరాధికుడొక్కడే. మతాలు వేరైనా ఆశయం ఒక్కటే

మానవతే మానవుని ప్రథమ కర్తవ్యం.

**BOOK POST** Printed Matter

To

ri. Dr. B. Rama Raju
1-8-117/2,
Chikkad Pally,
erab d-20.

*If underlivered please return to,*
SARVARTHA SANKSHEMA SAMITHI
501, Pradeep Apartments, Gandhinager, Hyd-38

Edited, Printed & Published by Sri P.V. Manohara Rao, Sarvaartha Sankshema Samithi, Hyderabad-20.
Designed at *Advanced Graphic Systems*, Hyd-20,